## అజ్ఝోపసంధి

(౧) తోడ్తెప్పి. బ. ౨౧౯; ఇర్గేలు (౧) ౪౩౨; ఏడ్డివంబులు (౧) ౪౭౨,౫౯౨; కూడ్డివడ (౧) ౬౦౧

(౨) ఏణ్ణూటు. బ. ౧౭౧; అన్నులుకు (అను + ఉలుకు) (౧) ౧౨౪

## పాదేశసంధి

ఉడుపనేతులు. బ. ౭౧;

## నుగాగమసంధి

సెనగుబ్రాలు. బ. 80.

## గసడదవాదేశము

(౧) మూఁడుసేసి=మూఁడేసి (౧) ౬౦౦

(౨) చే + చేతఁ = చేసేతఁ ... వ్యాసుండు (౧) ౬౭౫. 'చేఁజేతఁ' అని కాదు.

(3) గసడదవాదేశము బహుళము కాదు. అంటే, ఆదేశము చేయడము కవియిష్టము ననుసరించి ఉండదు. ఎక్కడ గసడదవాదేశము చేసితీరవలెనో ఎక్కడ చేయగూడదో నా 'ఆంధ్రభాషా చరిత్రము'లో తెలిపినాను. అక్కడ చూచుకోవలెను. ప్రభాకర శాస్త్రులుగారు 'ఒక' అను సంఖ్యావాచకవిశేషణముమీద గసడదవాదేశము చేసినారు. అది ఆంధ్రభాషాసంప్రదాయానుసారి కాదు.

## విసంధి

తన కవితాధార కడ్డు వచ్చినప్పుడు సోమనాథుడు విసంధిగా పదములను విడిచిపెట్టడానికి జంకలేదు. విసంధిగలతావులు బసవపురాణ, పండితారాధ్యచరిత్రములలో అనేకము లున్నవి.

## బసవపురాణము - పుటలు ‹ పంక్తులు

౫ (౬), ౧౧ (౧౩), ౨౧ (౨౪), ౨౪ (౨౩), ౨౬ (౧౦), ౪౪ (౯, ౧౯), ౪౫ (౨౨), ౪౭ (౨౦), ౫౧ (౧౨, ౨౩, ౨౬), ౫౨ (౧౦), ౬౦ (౧౬, ౨౭), ౬౫ (౧౪, ౧౫), ౬౮ (౧), ౭౦ (౩), ౭౩ (౨౪), ౭౬ (౧), ౮౨ (౨౫), ౧౦౮ (౮), ౧౨౧ (౧౨), ౧౬౧ (౧), ౧౬౩ (౬), ౧౬౮ (౧), ౨౧౫ (౨౩), మొదలయినవి.

## పండితారాధ్యచరిత్రము

### ప్రథమసంపుటము

౬ (౧, ౪, ౧౧, ౧౩), ౭ (౧౫), ౨౪ (౬), ౨౫ (౫), ౪౨ (౧౯), ౪౩ (౮), ౪౮ (౧౬), ౫౧ (౧౦), ౫౨ (౯, ౧౯), ౬౫ (౧) ౬౯ (౩), ౭౧ (౧౧), ౭౨ (౨), ౮౧ (౧౭). ౮౪ (౧౩), ౯౩ (౮, ౧౪), ౯౭ (౯), ౧౦౧ (౮), ౧౦౯ (౪, ౬), ౧౧౧ (౧౫), ౧౨౪ (౭), ౧౨౮ (౩, ౯), ౧౩౦ (౧౨), ౧౩౩ (౧౩), ౧౩౮ (౪), ౧౪౦ (౧౩, ౧౫), ౧౫౭ (౪), ౧౯౨ (౮), ౧౯౩ (౧౦), ౧౯౮ (౫), ౨౩౦ (౮), ౨౪౦ (౧), ౨౬౬ (౧౫), ౨౯౩ (౬), ౨౯౬ (౧౭), ౩౦౪ (౪), ౩౯౫ (౯), ౩౯౮ (౨), ౪౦౨ (౧౭), ౪౩౩ (౧౭), ౪౩౪ (౧౧), ౪౩౭ (౧౬), ౪౬౦ (౧), ౪౬౧ (౩), ౪౬౩ (౧౮), ౪౬౭ (౧౩), ౪౬౯ (౧౧), ౫౧౫ (౩), ౫౫౩ (౧౩), ౫౭౯ (౧౬), ౬౪౨ (౧), ౬౪౪ (౭), ౬౬౭ (౧౭), ౬౯౮ (౧౩), ౭౧౦ (౧౫)

### ద్వితీయసంపుటము

౨౬ (౧౩), ౪౫౦ (౩) మొదలైనవి.

## అనుకరణసంధి: ప్రథమావిభక్తి

### అకారాంతపుంలింగపదములమీద: ఏకవచనము

(అ) విసర్గమునకున్ను తత్పూర్వఅకారమునకున్ను 'ఓ' కారమాదేశము,—

(౧) ౨౪. స రుద్రో నాత్ర సంశయో యనఁగ; (౧) ౨౫. శైవో దశప్రత్యయో యనఁగ; (౧) ౩౨. న సంశయో యన; (౧) ౩౩ త్రిపుండ్రం బ్రాహ్మణో యన; (౧) ౩౯. నాంకయే ద్విప్రో యనంగ; (౧) ౩౯ పతత్యేవ న సంయో యనఁగ; (౧) ౪౦ న కుర్యా దంకనం నగో యనఁగ; (౧) ౪౦. పతత్యేవ న సంశయో యనఁగ; (౧) ౪౧ నాధికారీ చ లాంఛితో యనఁగ; (౧) ౫౨ అయం మే విశ్వభేషజో యనఁగ.

(ఆ) విసర్గలోపము,—

(౧) ౧౩. ఉమా మాతా పితా రుద్ర యనఁగ; (౧) ౩౩. భస్మచ్ఛన్న యనఁగ; (౧) ౩౩ ధృతత్రిపుండ్ర యనఁగ; (౧) ౩౫. అభావే వా తథా విప్ర యనఁగ; (౧) ౪౧. కస్యచిల్లాంఛితో మర్త్యయన; (౧) ౪౧. లాంఛితో హి న సంభావ్య యనఁగ(౧) ౪౩. జటాజూట విరాజిత యన (౧) ౪౩, ౪౪ త్రిపుండ్రేన విరాజిత యన (౧) ౪౩. భస్మావలిప్త సర్వాంగయన (౧) ౪౪. శుభ్రో జటాజూటయన (౧) ౪౪ త్రిపుండ్రోద్ధూళిసర్వాంగ యన; (౧) ౪౫ రక్షాభి రుద్ధూళిత యనఁగ.

### అకారాంతపులింగము: ద్వివచనము

(అ) (౧) ౯౪. బాణాసురదశాననా యన! (౧) ౯౯. తవ ప్రణీతౌ యను.

(ఆ) (౧) ౯౯. తవ ప్రణీతా వనంగ.

## అకారాంతపుల్లింగశబ్దములు : బహువచనము

(౧) ౩౬. అన్యత్స్నమాహితా యనఁగ; (౧) ౪౦. నదర్శనీయా యన; (౧) ౪౧. అస్పృశ్యాయాఃంగ; (౧) ౪౧. అదర్శనీయాయన; (౧) ౪౩, ౪౫. రుద్రాక్షభూషణా యనఁగ; (౧) ౪౩. అక్షమాలా న్వితకరా యనఁగ; కమండలుకరాన్వితా యనంగ; (౧) ౪౫. అక్షమాలావిభూషితా యనఁగ; (౧) ౪౭. షణ్ముఖాకమంగణేశ్వరాయనఁగ; (౧) ౪౭. భూమిభాగాశ్చ యే శుభా యనఁగ; (౧) ౪౮. దురాచారాశ్చ యే నరా యనఁగ(౧)౪౮. గృహేయస్మిన్ ప్రసూతా యనంగ (౧) ౫౩. శిష్టాః ప్రసిద్ధా భగవన్నపాపా యనఁగ (౧) ౫౩ అతస్త్వదీయా నపహాయ భక్తా యనఁగ; (౧) ౬౬. యే వీరభద్రవిశపితా యనను.

## అకారాంతనపుంసకలింగము: ఏకవచనము

(అ) (౧)౩౪. వర్తుల మనఁగ (౧)౩౫. నాస్తిభస్మవినాస్నాన మనఁగ; (౧) ౩౫. న దీక్షా న తపో మంత్ర మనఁగ; (౧) ౩౫. న యజ్ఞా దేవతార్చన మనఁగ; (౧) ౩౫. వేదాగమజ్ఞాన మనంగ; (౧) ౩౬. యదసత్యం మృదాధార్యమనఁగ; (౧) ౩౬. అహోమోహస్య మాహాత్మ్య మన (౧) ౩౬. త్రిపుండ్రం మోక్షదం త్యక్తమన; (౧) ౩౭. భూతిస్నానమనఁగ(౧)౩౮. అశుద్ధం చ తథా ప్రోక్తమనగ; (౧) ౩౯. సోర్ధ్వపుండ్రమన; (౧) ౪౦. పాతిత్యమన; (౧) ౪౫. భస్మస్నిగ్ధమనఁగ ; (౧) ౪౬. భగవాంశ్చరుద్రం పవిత్రమన; (౧) ౪౭. అనంతమనఁగ ; (౧) ౪౮. సర్వమంగళ మాంగళ్యమనఁగ (౧) ౪౯. రుద్రయత్తే జనిమ చారు చిత్రమనదె? (౧) ౫౦. సంసారసాగరం ఘోరమన; (౧) ౫౪. లింగంహేమ మయమని (౧) ౫౪. ఇంద్రనీల మయం (శైలమయం) లింగమనఁగ (౧) ౫౫. అన్నమయం లింగ మనఁగ (౧) ౫౫. వరవకికాంస్యకం లింగ మనఁగ.

(ఆ) (౧) ౪౮. సర్వపావనపావన మ్మనఁగ- (౧) ౪౯. ఉత్పాతప్రశమం మ్మనఁగ - సర్వరోగప్రభేదన మ్మనఁగ - ఇష్టసిద్ధి ప్రదాయక మ్మనఁగ- (౧)౫౦. గృహీత్వా చాగ్నిహోత్రజ మ్మనఁగ- (౧) ౫౧ పునరావృత్తిమోచన మ్మం- (౧) ౫౨ ఇదం తవ ప్రసన్నేన మ్మంచు- (౧) ౫౪. లింగం మణిమయ మ్మనంగ- (౧) ౫౫. కాంస్యక మయ మ్మనఁగ (౧)౫౫. పార్థివలింగమ్మనంగ- (౧) ౫౬. ముక్తాఫలమ య మ్మనంగ.

(ఇ) (౧) ౩౨. త్రిపుండ్రస్యచ ధారణం బనియు-(౧) ౩౨ తత్ఫలం కోటిగుణితం బనంగ - (౧) ౩౩. భస్మోద్ధూళితం బన- (౧) ౩౪. ఊర్ధ్వపుండ్రకం బన, (౧) ౩౪. ఊర్ధ్వం బనఁగ- (౧) ౩౫. త్రిపుండ్రం భస్మనాకృతంబనఁగ - (౧) ౩౫. భస్మనావాఽత్య వర్జితం బనఁగ - (౧) ౩౬. అన్యత్రవిచేష్టితం బనఁగ - (౧) ౩౭. భస్మనావాఽత్యయం బనంగ; (౧) ౩౮. వర్తులం చార్ధచంద్రకం బనిన- (౧) ౩౮. అశుద్ధం చార్ధచంద్రకం బనఁగ - (౧) ౩౮. వర్తులం తూర్ధ్వపుండ్రకం బన- (౧) ౪౦. శంభుపాదోదకం శుభం బనుచు- (౧) ౪౧. నవాఽపి సుహ్యాం బన.

అకారాంతపుంలింగము: బహువచనము

(౧) ౪౪. రుద్రాక్షవలయా యనంగ.

అకారాంతనపుంసకలింగము: బహువచనము

(౧) ౪౨. ఏతాని రుద్రాక్షాణి యనఁగ- (౧) ౪౫. శుభ్ర త్రిపుండ్రాణి యనఁగ-(౧) ౬౦. అభిదేవప్రసాదలబ్ధాని యన-(౧) ౬౨. మద్రసోపేతమద్వ్యాధావారజలపుష్పజాతాని సర్వాణి యనఁగ- (౧) ౬౩. ఇత్యాదివాక్యాని యనం- (౧) ౬౪. గృహీతపరిమళాని పుష్పాణి పత్రాణి యన-

### అకారాంతస్త్రీలింగము: ఏకవచనము

(౧) ౪౫. రుద్రాక్షమాలా యను-(౧)౨. శివా తనూ రఘోరా యని-

### ఇకారాంతపుంలింగము: ఏకవచనము

(౧) ౪౨. రుద్రాక్షధరశ్శుచి యనంగ (య-ప్రాస)- (౧) ౪౬. వరం పాపోదకవిధి యనఁగ- (౧) ౬౦. యస్మా దనర్హామీశ్వర స్సై వేద్య మిత్యాదియనఁగ-

### ఇకారాంతస్త్రీలింగము: ఏకవచనము

(అ) (౧) ౩౪. అగ్నిదగ్ధమితి శ్రుతి యనఁగ-

(ఆ) (౧) ౩౪. అర్ధచంద్రాకృతి రనఁగ-(౧)౭౧. పద్మాభశ్లోం భూమి రన- (౧) ౯౯. నహి మే శక్తి రన.

### ఇకారాంత పుంలింగము: బహువచనము

(౧) ౪౩. కింపునర్స్నానవాదయో యని (యో.యతి);

### ఈకారాంత స్త్రీలింగము: ఏకవచనము

(౧) ౪౩. జటామండలధారిణీ యనఁగ - (౧) ౫౩. అపాప కాశినీ యనెడు- (౧) ౮౦. నవిషూచీ యనంగ

### ఉకారాంత పుంలింగము: ఏకవచనము

(౧) ౪౪. శుశుభే సతతో విష్ణు రనఁగ- (౧) ౫౫. ఆరకూటమయం వాయు రన- (౧) ౯౪. అసౌ త్రిగు రన- (౧) ౯౪. అప్సా ధాతు రన-

### ఉకారాంత నపుంసకలింగము: ఏకవచనము

(౧) ౪౦. దూషితశ్చాపి పాదాంబు అన.

ఋకారాంత పుంలింగము: ఏకవచనము

(౧) ౫౨. అయం మాతా అయం పితా యనఁగ-

ఋకారాంత పుంలింగము: ద్వివచనము

(౧) ౫౨౭. శివో మేవ మే పితరా వనంగ.

ఓకారాంత స్త్రీలింగము: బహువచనము

(౧) ౯౪. తిస్రో గావ యను.

అన్-అంత పుంలింగము: ఏకవచనము

(౧) ౩౨. విరజా విపా(ప్మాయనంగ-(౧)౪౧. రాజాయనంగ-

(౧) ౪౪: శుద్ధాత్మా యనంగ-

అన్ - అంత పుంనపుంసకలింగము: ఏకవచనము

(౧) ౫౦. విరజానలజం భస్మ యనఁగ - (౧) ౪౬. ఋతగ్ం సత్యం పరం బ్రహ్మ యనఁగ-(౧)౪౫. రుద్రాంశ్చ పంచబ్రహ్మ యనఁగ,

ఇన్ - అంత పుంలింగము: ఏకవచనము

(౧) ౩౩. తత్త్యాగీ యనంగ - (౧) ౩౬. కోఽపి మలినధారీ యనఁగ-(౧) ౪౩. రుద్రాక్షవలయీ యనంగ- (౧) ౪౪. త్రిపుండ్రాంకితసర్వాంగి యన - (౧) ౯౨. కేవలాఘో భవతి కేవలాదీ యనంగ:

ఇన్ - అంత పుంలింగము: బహువచనము

(౧) ౩౬. మునీంద్రా బ్రహ్మవాదినో యన-(౧)౩౭. మనుష్యా పాపకర్మిణో యనఁగ - (౧) ౪౬. సర్వే తపస్వినో యన- (౧) ౭౪. భవంతి క్లేశభాజినో యన.

మతుబంత పుంలింగము: ఏకవచనము

(౧) ౬౦. భగవా నన.

పకారాంతము : బహువచనము

(౧) ౭౨. విరాడాపో యనంగ.

సకారాంతము : ఏకవచనము

(అ) (౧) ౩౩. విద్వాననంగ- (౧) ౬౧. మనశ్చంద్రమా యన.

(ఆ) (౧) ౩౨. స ఏవ భస్మ జ్యోతి యనంగ.

(ఇ) (౧) ౭౫. అణోరణీయాన్ మహతో మహీయాననంగ.

(ఈ) (౧) ౫౩. అపాపకాశినీ వపు రనంగా.

స-కారాంత పుంలింగము: బహువచనము

(౧) ౯౧. ప్రశాంతమనసో యనంగ- విద్వాంస యనంగ.

ఏతచ్ఛబ్దము: బహువచనము

(౧) ౭౮. తీర్థోదకస్యైతే యనంగ.

సంబోధన ప్రథమావిభక్తి

అకారాంతపుంలింగము: ఏకవచనము

(౧) ౫౨. యా తే రుద్ర యనంగ.

ఉకారాంతపుంలింగము: ఏకవచనము

(౧) ౧౦౦. మార్తాండ భానో కుష్ఠ యనుచు

ద్వితీయావిభక్తి

అకారాంతపుంలింగము: ఏకవచనము

(అ) (౧) ౫౦. సముద్ధార్యా సదాచార్యమనంగ- (౧) ౪౭. పాశజాలహారం పరం బన- (౧) ౭౫. పూజయేత్పర మేశ్వర మనంగ- (౧) ౭౭. సేవతేస్మ మహేశ్వర మనంగ- (౧) ౩౯. నాంకయేన్న దహే ద్దేహ మన- (౧) ౫౦. తం ప్రపద్యే మహేశ్వర మ్మనంగ-

### అకారాంత నపుంసకలింగము: ఏకవచనము

(౧) ౮౦. నాంకయే న్న దహో ద్ధాత్ర మనఁగ- (౧) ౩౨. దేవానాం త్రయాయుష మ్మనఁగ - (౧) ౮౬. వింద్యా ద్ర్బష్ట ఘాతుక మ్మనఁగ (౧) దక్షిణే ణాభిమంత్రితం బనఁగ.

### ఆకారాంతస్త్రీలింగము: ఏకవచనము

(౧) ౮౫. పంచాక్షరీం విద్యా మనంగ

### ఇకారాంతస్త్రీలింగము: ఏకవచనము

(౧) ౮౨. తే యాంతి పరమాం గతి మనఁగ

### ఈకారాంతస్త్రీలింగము: ఏకవచనము

(౧) ౮౯. కళాం నార్హంతి షోడశీమనంగ

### అన్-అంత పుంలింగము: ఏకవచనము

(౧) ౮౨ తరతి పాప్మాన మన.

### తచ్ఛబ్దము

(౧) ౮౦. అంకతో యస్య దేశా త్తమనఁగ

### ఆకారాంతపుంలింగము: బహువచనము

(౧) ౮౯. ఏకపూర్వ్యాః దశాపరా నన- (౧) ౫౩. అన్యా నశిష్టా ననఁగ

### తృతీయావిభక్తి: ఏకవచనము

(అ) (౧) ౩౦. తదాకారేణ శస్త్రేణ యనఁగ- (౧) ౩౯. ధారయిష్యంతి మోహేన యనఁగ- (౧) ౮౩. ఋగ్యజుస్సామ ఘోషేణ యనఁగ- (౧) ౮౬. య ఆచామతి మోహేన యనఁగ- (౧) ౫౨. ప్రణ్మేనానువాకేన యన- (౧) ౯౯. పవనః పన్నగేశేన యన-

(ఆ) (౧) ౬౬. ఏషా యదగ్నినా యన-

(ఇ) (౧) ౫౦. ప్రణిపత్యాత్మవిద్యయా యనఁగ-(౧) ౪౭. పశ్చాదశుచిశంకయా యన-(౧) ౩౧. అగ్నేస్సముత్థయా యనియు-

(ఈ) వాతరూపేణ శంభునా యన.

(ఉ) (౧) ౩౪. అగ్నిదగ్ధేన భస్మనా యనఁగ - (౧) ౩౬. సితభస్మనా యన.

(ఊ) (౧) ౯౯. నిపీతః పుణ్యకారిణా యనఁగ.

(ఋ) (౧) ౫౩. శ్రుతం తేన యనను (౧) ౩౫. అధీత్య శ్రుతం తేన యనఁగ.

(ౠ) (౧) ౭౭. దర్శనాత్స్వీకృతమ్మయా యనఁగ.

బహువచనము

(అ) (౧) ౧౮. ఆనియ గణై రనియు-(౧) ౩౮భిద్యతే యమకింకరై రనఁగ-(౧) ౩౯. నధార్యం వైదికైర్నరై రనఁగ -(౧) ౩౯-౦ ౪౦. దేవతాయుధలాంఛనై రనఁగ- (౧) ౪౦. దుర్వ్యాచ్చచక్రాద్యై రనంగ- ఆయుధైశ్శంఖచక్రాద్యై రనంగ - నదహేచ్చక్రపూర్వకై రనఁగ - (౧) ౪౪. రుద్రాక్షమండనైరన - త్రిపుండ్రకో దినైర్యై రనంగ-(౧) ౮౭. తేనైన పిండైస్సతిలై రనంగ. (౧) ౮. ప్రసాదితైరనియు - సుఖితమైరనియు - భేషజైరన - జ్ఞానదైరన.

(ఆ) (౧) ౩౬. నదుర్వ్యాస్మృతికాదిభిరన (౧) ౩౮. కీర్తితం చాండశాధిభిరనఁగ - (౧) నసంభాష్యాద్విజాదిభి రనఁగ - (౧) ౪౬. గంధపుష్పాక్షతాదిభిరను - (౧) ౮౬. త్యాదత్తైభిరన- రుద్రశంతమేభిరన- (౧) ౮౭. భేషజేభిరన.

(ఇ) సురైర్వ్యామునిభిర్నరైయన (య- ప్రాస.)

**చతుర్థీ విభక్తి: ఏకవచనము**

(అ) (౧) ౬౪. సంకల్పితం శివాయ యనఁగ- (౧) ౭౦.

నమో భగవతే రుద్రాయ యన-పూర్ణం పురుషాయ యన-ఉత్తమపురుషాయ యన- (౧) ౯౭. తత్తత్సమర్ప్య దేవాయ యన-

(అ) (౧) ౯౯. నగిరాంపతయే యనంగ

(ఇ) (౧) ౮౩. హరాయ పరమాత్మనే యనంగ

(ఈ) (౧) ౯౩. నమోరుద్రాయ పథిషదే (వనసదే) యనుచు అప్సుషదే యన.

(ఉ) అయం నే యన

## బహువచనము

(అ) (౧) ౫౩౫. తవో స్తేషనిమేషేభ్య యనంగ -(౧) ౬౭. విశ్వపతిభ్య యనంగ.

(ఆ) (౧) ౯౮. నగోజలాదిభ్యో యనంగ.

## పంచమీవిభక్తి: ఏకవచనము

(౧) ౩౩. యస్మాత్తనంగ-(౧) ౩౯. యది వా మోహాత్తనంగ (౧)౪౦. యాతి తత్ క్షణాత్తన- (౧) ౪౧. దేశాత్తనంగ- (౧) ౪౮. పాదాంబుధారణాత్తన - (౧) ౪౮. ప్రాప్యతే మూర్ధ్నిధారణాత్తన- (౧) ౪౯. సంభోగాత్తనంగ - (౧) ధ్యానాదర్చనాద్ధారణాదపి యనంగ-

## షష్ఠీ విభక్తి: ఏకవచనము

(అ) (౧) ౪౬. అథాతో మహాదేవస్య యనంగ- (౧) ౫౨. న్యపైకపుష్పస్య యనంగ- (౧) ౬౬. తేషామనర్హా మీశస్య యన

(ఆ) (౧) ౭౬. ఆత్మా నుహాయాం నిహితోఽస్య జంతో- యనంగ.

(ఇ) (౧) ౫౩౦. జనితా పృథివ్యా యనంగ-

(ఈ) (౧) ౫౩౦. జనితాదిదివిష్ణో రనంగ.

(ఉ) (౧) ౪౭. పాదోదకం పురభిద యనంగ.

(ఊ) (౧) ౭౦. ఆత్మానమాత్మనో యనంగ- (౧) ౫౦. లంఘ యా మ్యహ మాత్మనో యనంగ.

(ఋ) (౧) ౫౭౯. జనితాదినో యనంగ.

ద్వివచనము

(౧) ౩౪. వర్తులం నృపవైశ్యయో రనంగ.

బహువచనము

(అ) ౩౩. సురవిప్రాణా మనంగ (౧) ౩౪. శూద్రాణా మనంగ-

(ఆ) (౧) ౭౩. తండులాదీనామనంగ.

(ఇ) (౧) ౩౪. అశ్వేషా మనంగ.

సప్తమీవిభక్తి: ఏకవచనము

(అ) (౧) ౩౩. వైశ్యదేవేశ్వరార్చనే యన- (౧) ౪౨. వైశ్యదేవే సురార్చనే యనంగ- (౧) ౪౫. అథర్వశిరశ్శిఖే యను- (౧) ౬౧. ఉత్తమాంగే గళేయని- (౧) ౭౮. నభక్తా మహేశ్వరే యనంగ- (౧) ౮౩. యచ్చా ద్ధకాలే యనంగ- (౧) ౯౦. ఆత్మన్నభక్షణే యనంగ - (౧) ౯౪. ప్సా భక్షణే యనంగ - (౧) ౫౩౫. ప్రత్యంజన స్త్రిస్మతి సంయుగాంత్య కాలే యన.

(ఆ) (౧) ౫. నాభ్యామన

(ఇ) (౧) ౫౭. బిభ్రతి ద్రుమం మూర్ధ్ని యనంగ (౧) ౬౦ ధృతం మూర్ధ్నియనంగ-

(ఈ) (౧) ౬౭. తద్విశ్వరూపిణి యన

(ఉ) (౧) ౩౫. యేన విప్రేణ శిరసి యనను

## ద్వివచనము

(౧) ౮౦. జువప్రీతిసేవనయో రనంగ

## బహువచనము

(అ) (౧) ౪౨. యద్విప్రసంధ్యాదిషు చ కర్మసు అనంగ- (౧) ౭౪. తీర్థే స్నాతి తీర్థే హితేషు అనంగ

(ఆ) (౧) విన్యస్తయుకు శేవ్వనంగ

## క్రియలు

(అ) (౧) ౫౦. యది మోన్యాః ప్రయుంచ్యామి యనంగ- (౧) ౮౯. అశ్నామి యనంగ-

(ఆ) (౧) ౬౫. ప్రాణలింగే చరే యనంగ (౧) ౮౯. భవంత భవ ఆయజే యనంగ

(ఇ) (౧) ౩౩. మా త్వా హవామహే యనంగ- (౧) ౪౯. సుయజా యజామహే యనంగ- (౧) ౪౯. యజామహే యంచు- (౧) ౭౦. తత్పురుషాయ విద్మహే యనంగ-

(ఈ) (౧) ౬౯. పుత్త్రనామాసి యనంగ- (౧) ౯౯. సర్వలోకానాం పితాసి యనంగ.

(ఉ) (౧) ౬౮. యల్లోకేఽస్తి యనంగ- (౧) ౭౨. తండులైర్జుహోతి యన- (౧) ౮౩. హరభుక్తశేషం దదాతి యన- (౧) ౮౮. మేధావీ భవతి యన-

(ఊ) (౧) ౯౫. శ్వమాంసాస్థిమాత్రం భుంక్తే యన- (౧) ౫౨౯. సోమః పవతే యన- (౧) ౩౬. ఏతదన్యాన్ రమతే యనంగ- (౧) ౪౩. శ్వాఽపి వా మ్రియతే యనంగ-

(ఋ) (౧) ౩౩. వ్రత్యా విధీయతే యనఁగ- (౧) ౩౪. త్రిపుండ్రాంకం ప్రశస్యతే యన- (౧) ౩౬. మయా వక్తుం న శక్యతే యనఁగ- (౧) ౫౦. పునర్జన్మ న విద్యతే యనఁగ- (౧) ౬౩. నైవేద్య శబ్దేన కిమభిధీయ్యతే యనుచు- (౧) ౭౮. న విద్యతే యనఁగ- ఊభ భుజ్యతే యనఁగ - దేవేభ్యో హి దీయతే యనఁగ- (౧) ౮౮. కృతి ఘ్నోఽపి న ముచ్యతే యనఁగ- (౧) ౯౪. గోశబ్దేన చ [illegible] యన- (౧) ౯౯. ధురీణత్వ మవాప్యతే యనఁగ-

(ౠ) (౧) లలాటే ధారయిష్యంతి యన-(౧) ౪౨. వేదా ధారయంతి యనంగ- (౧) ౮౭. కృతఘ్నా భవిష్యంతి యనఁగ-(౧) ౯౦. రుద్రేణ పీతం పిబంతి యను- రుద్రేణాత్త మశ్నంతి యనఁగ-

(ఌ) (౧) ౭౪. వేదాశ్చ కామయంతే యను-

(ఏ) (౧) ౫౨. అయం జీవాతు రాగమ త్తనఁగ-

(ఐ) (౧) ౩౨. నచ పున రావర్తతే యన

(ఒ) (౧) ౩౪. స్రష్టా సృష్టిచ్ఛలేనాహ యనఁగ-

(ఓ) (౧) ౪౯. 'మా'యంచు- (౧) ౭౭. ఆత్మనాసహ నారా జయ యనఁగ-(౧)౯౫. తదేనో భుంక్ష్వ యనునట్లు- క్రిమిం భుంక్ష్వ యనఁగ- అధో గచ్ఛ యను- బ. ౧౫౯. శివమస్తు శివమస్తు శివమస్త టంచు.

(ఔ) (౧) ౩౦. సద్గురుభ్యో నివేదయే త్తనఁగ- (౧) ౩౨. విమృజ్యాంగాని సంస్పృశే త్తనఁగ- మంత్రితం భస్మ ధారయే త్తనఁగ- (౧) ౩౩. మనసాఽపి న లంఘయే త్తనఁగ- పతితో భవే త్తన- (౧) ౩౫. వ్రతమస్య వ్రతంభవే త్తనఁ- త్రిపుండ్రం విమోనధారయే త్తనఁగ- లౌకికాగ్నౌ స్తదాహరే త్తనఁగ- (౧) ౩౬. ఆగ్నేయమాచరే త్తనఁగ- (౧) ౩౮. వ్రతం చాంద్రాయణం చరే త్తనఁగ- (౧) ౩౯. నాంగం చహే త్తన- (౧) ౪౦. శీఘ్రం ప్రవాసయే త్తనఁగ - (౧) ౪౧.

ప్రవాసయే త్తన- న సాక్షీ సర్వదా భవే త్తనగ- శీఘ్రం ప్రవాసయే త్తనగ- (౧) ౪౬. ఇతి ప్రపిబే త్తన- (౧) ౪౭. బిభ్రచ్ఛుద్ధిమాప్నుయా త్తనగ- (౧) ౫౨. సహస్రాంశం నపూరయే త్తనగ- యత్ప్రమాణఫలం భవే త్తనగ-

(క) (౧) ౯౭. కదాచిన్నైవ భుంజీత యనియు-(౧) ౩౫- భస్మనైవ ప్రకుర్వీత యన- (౧) ౪౭. అశౌచంనైవ విద్యేత యన.

(ఖ) (౧) ౩౭. ఊర్ధ్వపుండ్రం ద్విజాః కుర్యురన-(౧) ౬౭. భవేయు రన-(౧) ౭౩. వ్యర్థాని స్యు రనగ.

(గ) (౧) ౩౧. భూత్యై న ప్రమదితవ్య మనగ- (౧) ౯౨. నప్రమదితవ్య మనియు-

## అసంపూర్ణక్రియలు

(అ) (౧) ౩౭. భస్మ వామకరే స్థాప్య యనగ-౩౭, ౧౬౪. వారుణ ముత్సృజ్య యన-(౧)౪౬. వ్యాఖ్యాస్యామ శంఖం ప్రపూర్య యన,గ- కంఠ్యమాశ్రిత్య యనగ- అయం మే శిరస్యభ్యర్చ్య యనగ (౧) ౪౭. పాణిశుక్తిభిరాదాయ యనగ -

(ఆ) (౧) ౩౯. ముఖం దృష్ట్వా యనగ- (౧) ౪౭. పాదోదకం పీత్వా యనగ.

(ఇ) (౧) ౩౬. భస్మ సంత్యజ్య కుర్వన్ననగ.

## అవ్యయములు

(౧) ౪౨. మృణ్మయం వాఽపి యనంగ - (౧) ౬౧. ఉత్తమాంగే గళేవాఽపి యనగ - శుచిర్వాప్యశుచిర్వాఽపి యనగ -

(౧) ౩౭. రక్షార్థ (మంగళార్థ - లింగార్థ) మన -

(౧) ౪౭. తేఽపి పూతా భవంత్యాశు అనగ - (౧) ౬౭. తమసః పరస్తాదితి యనగ - (౧) ౩౨. జ్యోతిర్భవత్యేవ యనగ - (౧) ౩౫. కృతం స్యాదకృతంచైవ యనగ - (౧) ౩౭. శ్రుతయః

స్మృతయశ్చైవ యన - (౧) ౪౯. అగమ్యాగామినశ్చైవ యనఁగ-(౧) ౫౬. దారుజం నిర్మితశ్చైవ యనఁగ - (౧) ౩౫. అధీత మనధీతంచ యనఁగ - (౧) ౩౬. ముచ్యతే సర్వపాపైశ్చయన - (౧) ౩౭. సర్వతీర్థావగాహాశ్చ యనఁగ - పవిత్రార్థంచ యనఁగ - పురాణాన్యఖిలానిచ యనఁగ - (౧) ౩౮. ఊర్ధ్వపుండ్రం త్రిశూలంచ యన - (౧) ౪౪. రుద్రాక్షైశ్చ యనఁగ - (౧) ౪౫. త్రిపుండ్రాలంకృతాంగాశ్చ యనఁగ - (౧) ౩౮. లీలయాఽపి కదాచనయనఁగ - (౧) ౪౦. న దహేచ్చ కదాచన యనఁగ-నాధికార్యాః కదాచన యనఁగ; (౧) ౯౭. వస్తు కించిత్కదాచన యనియు - (౧) ౩౯. న దహేత్కామకారత యనఁగ-(౧) ౯౭. ఉపభోగాయ పురతో యనంగ; (౧) ౩౪. ససర్జ చ లలాటం హి తిర్యక్కన - (౧) ౪౮. సూతకే ప్రేతకే తథా యన - (౧) ౬౩. షడ్విధంతథా యనఁగ - (౧) ౯౨. భుక్తిభాక్సదా నాన్యథా యనఁగ - (౧) ౫౭. అపరిమితథా యన - (౧) ౬౭. విశ్వరూపాయ వై నమో యనఁగ - (౧) ౩౭. దత్తం మయా పురా యనఁగ - (౧) ౧౮. ప్రాసో వా యనియు -(౧) ౩౪. అర్ధచంద్రంతు వా యనఁగ - (౧)౬౯. ఆత్మా నై యనఁగ - (౧) ౮౧. సో మోవై యనంగ -(౧) ౪౧. రాజా శీఘ్రమన - (౧) ౫౮. సర్వతీర్థఫలం సద్యయన - (౧) ౪౬. శతధాచ సహస్రధాసమమున - (౧) ౩౮. లలాటే శ్రద్ధయాసహ యనఁగ - (౧) ౩౭. తత స్తస్థారయేత్సదా యనఁగ - (౧) ౫౬. తామ్రలింగం సదా యనఁగ - (౧) ౫౮. గంధలింగం మనోన్మని యనఁగ -

(౧) ౬౭. అపరమేశం కించి దనఁగ ( - త్తి కాదు.)

## కొన్ని మిశ్రసమాసములు

(౧) భక్తభండారి. బ. ౬ - చౌడశాబ్జము. బ. ౧౫ - శివమరులు. బ. ౨౩, ౪౭ - గజసాహిణి, అశ్వసాహి. బ. ౪౬ - శివముటు

(మం॥స) (౨) ౯౧- ముల్లోకవంద్య. బ. ౨౬- ప్రతిజోకలు. బ. ౩౦ నిత్యనేమము. బ. ౪౪- నిత్యవేయుందామరలు. బ. ౨౦౪- నిత్యవేయేసిమాడలు (౨) ౩౭- నిత్యపడి. బ. ౫౫- ఘనమీశ. బ. ౫౫, ౨౦౭- సర్వాంగకచ్చడము. బ. ౬౦ - ౬౩ - షోడశపండువు. బ. ౮౧- బత్తీసాదిరాగంబులు. బ. ౭౯- ఆదికమ్మరి. బ. ౧౦౨- తవసిధి. బ. ౭, ౪౫, ౧౧౧, ౧౧౪ - శివకరవాలు బ. ౧౪౬ - భావుకమోజు. బ. ౧౪౬. శూలకట్టు. బ. ౧౮౨, ఇల్లాది. బ. ౧౩౨- ధర్మకవితె. బ. ౧౪౦. మంత్రతంత్రలూలామాలనులు. బ. ౧౮౨ - మజ్జనబావి. బ. ౧౮౯ - ఇతరవేల్పులు, బ. ౨౦౧ - బ్రహ్మపురులు. బ. ౨౧౮ - ముల్లోకనాథుడు. బ. ౨౩౮ - జన్మఫలంబు. (౧) ౧౪౩ - అధమపాఋలు (౧) ౧౩౧ - పండిత మల్లన్న. (౧) ౧౯౯. దీపకంభములు. (౧) ౧౯౯- బిల్వపత్తిరి (౧) ౩౮౬ - రుద్రాక్షపక్కెరల్ (౧) ౪౧౦ - పంచవన్నియలు. (౧) ౧౬౬ - (౨) ౪౨౯- వీరయాదెయ్య (౨) ౯౧. మొదలయినవి. కర్తానుసారి [కర్త్రనుసారి అనడానికి] (౧) ౫౪౩.

## తెలుగుసమాసములు

(౧) వచ్చినవారిచే + పోయినవారిచే = వచ్చిన పోయినవారిచే. బ. ౨౫- బిజ్జలుని తలనుంచుగండా! బ. ౨౪౪, (౨) కన్నడపదముతో సమాసము - శివద్రోహరగండఁడు బ. ౧౦౪. (౩) యావత్తుధనము. బ. ౮౪. (సంస్కృతములోని యావచ్ఛబ్దము తెనుగులో 'యావత్తు' అని తత్సమమై 'సమస్తము' అనే అర్థమును పొందినది.) (౪) బహువ్రీహిసమాసములు : ఉడిదెనెలు(పుష్పములు) (౧) ౨౬౫. ఇక్కంటి, ముక్కంటి (౨) ౧౧౭.

## విశేష్యములు— ప్రథమావిభక్తి

(౧) అయగారు. బ. ౮౧ ('అయ్యగారు'కు రూపాంతరము)

(౨) సంస్కృతములోని అకారాంత నపుంసకలింగ శబ్దములకు ప్రథమైకవచనములో మువర్ణకము చేరక, అవి స్త్రీ సమములుగా ఉండడము :

బ్రాహ్మణంబు తుదిఖండలు. (౧) ౬౯- అర్ణవఘోషణ (౧) ౫౧౩- చారణలు. (౧) ౪౭౭- కౌమారసర్గ (౧) ౬౫౧ - సంసర్గ (౧) ౪౨౧- సాంఖ్యున్ (౧) ౫౬౩-

(౩) అకారాంత పుంలింగ శబ్దముల కుత్తుమాత్రము చేరి, డుజ్జు రాకుండడము: వృద్ధ (౧) ౪౬౬

(౪) సంస్కృత నకారాంత శబ్దము: కష్ణవర్త్మ. (౧) ౬౫౩

(౫) సాన్నిధ్యత.— ఇష్టే, ఐక్యత, ప్రాముఖ్యత. మొదలయిన రూపములు తెనుగులో చేరినవి.

(౬) 'ఈయస్' అంతమందుగల శబ్దములను సోమనాథుడు తెనుగు చేయడములో తెనుగువారి వ్యవహారము ననుసరించి 'ఈయాన్' అని అంతమందుచేర్చక, 'ఇయ్యాన్' అని చేర్చినాడు. అయ్యో... మ,హియ్యానంగ.(౧) ౭౫- అయ్యు...మ, హియ్యాన్.(౧)౫౬౭

(౭) 'మహాదేవి'కి తద్భవరూపము 'మహదేవి'. బెజ్జమహదేవి. బ. ౬౬;- దాస + అయ్య = దాసమయ్య- దాసమయ్యలు. బ. ౧౪౬ దేడరదాసమయ్య. బ. ౧౮౬- శంకరదాసమయ్య. బ. ౧౧౩;—

(౮) ఈ క్రిందిరూపములు కనిపిస్తున్నవి:కాళిదాసి (౨) ౧౦౪, ౧౧౦, ౧౧౩- దాసి (మహద్వాచకము) బ. ౧౪౦- భక్తసమూహి. బ. ౫౨, ౧౧౪, ౧౨౯- సకల భక్తసమూహి. బ. ౨౪౫- లింగమనః ప్రవేశి. బ. ౩౪- శంకరదాసి (మహద్వాచకము) (౧) ౧౧౯- సరస సంభూషి బ. ౩౪.

(౯) విశేషణమును విశేష్యముగా వాడడము: కమనీయ మెంు దన్. బ. ౭౫,

(౧౦) మహద్వాచకమునకు మాఱుగా గుణవాచక విశేష్య మును వాడెడము: అసమాత్ముతోఁ డ మాఱంకమై గెలిచె. బ. ౪౭.

(౧౧) కొన్ని తద్ధిత ప్రత్యయములు:

—అరి.—కనుమరి. బ. ౧౦౨- కల్లరి. బ. ౨౪- జాలరి బ. ౧౦౨-

—ఈఁడు.—కొండీఁడు. బ. ౨౪- వెండీఁడు. బ. ౧౦౩- డింగరీఁడు. బ. ౧౪౦.

—అది. (స్త్రీవాచక ప్రత్యయము)- బానసమునది. బ. ౪౫

—కత్తె—అభిమానకత్తె. బ. ౧౪౪

—ఎత—జంగెత. బ. ౨౨౩- మింజెత. బ. ౫౯

—మోపి—ముండమోపులపగిడి, (౧) ౩౪౪.

—తనము—కండక్రొవ్వుఁదనంబు. బ. ౨౧౦- అతిమతి తనము. బ. ౧౦౫, ౧౩౪- అఱగొడ్డితనము. బ. ౧౪౬- ప్రధాని తనంబు. బ. ౫౪

—అమి—కష్టువల్వమియొ. బ. ౭౦

—తికము—౦ం జెటికము. బ. ౬౨

దఘ్నార్థమున 'బంటి' చిఱుకొలబంటె. (౧)౫౯౦- పుక్కిలి బంటి. బ. ౧౦

—ఇకము—ఆదరికము. బ. ౮.

## బహువచనరూపములు

(౧) అందలాలు (౨) ౩౯౭- పొట్లాలు- బ. ౭౭- ఆల వట్టాలవారు. బ. ౨౩౪- దిపగంభాలు. (౧) ౧౩౦

(౨) మీసలు. బ. ౨౧౬, ౨౩౨-

(౩) చాంగుబళాలు. బ. ౨౧౪

(౪) వెంట్లు. బ. ౭౫- అశిష్ట్లు. (౧) ౫౩- ద్విష్ట్లు. బ. ౩౦, (౧) ౧౭౯, ౧౯౪, ౨౨౧, ౨౨౫, ౩౩౨, ౩౪౪, ౩౬౬, ౪౨౨, ౪౨౪, ౬౧౩, (౨) ౫౮, ౨౨౦, ౩౨౯, ౪౦౫- దుష్ట్లు (౧) ౨౫౧- శ్రేష్ట్లు (౧) ౩౪౪, ౪౨౨, ౬౯౧- (౨) ౨౨౦.— శిష్ట్లు (౧) ౨౫౧.

(౫) దివ్వటీలు. (౨) ౭౪.

(౬) బంట్లు. బ. ౭౪- నిఘంట్లు (౧) ౬౧౫.

(౭) పెటికెసెట్లు. బ. ౪౩.

(౮) మేలుకట్లు. బ. ౫౯- కంథకట్లు. బ. ౫౯ - ముప్పేట్లు (౧) ౧౧౮- చోట్లు (౧) ౩౦౯,

(౯) వెరవిండ్లు. బ. ౨౨౪- పిల్లాండ్లు (౨) ౩౪౧.

(౧౦) అంగళ్లు (౨) ౩౯౮- అల్లుళ్లు బ. ౭౪- [illegible]రళ్లు (౧) ౧౪౭- కళ్లు (ఏక.కడి) బ. ౩౭- చేకళ్లు బ. ౬౯ - కావళ్లు (౨) ౩౯౭- చావళ్లు (౨) ౩౯౭- బుడివుళ్లు బ. ౨౦౫, ౨౧౪, ౨౩౦, ౨౩౧, ౨౪౨, (౨) ౩౧, ౩౪౪- మండళ్లు (౨) ౩౯౭- సంగళ్లు (౨) ౩౯౮- సందళ్లు (౨) ౪౧౪.

(౧౧) అల్లురు, (౧) ౬౮౮- అల్లుండ్రు (౧) ౬౮౭- ఒయ్యాన గాండ్రు బ. ౧౪౫- మత్తికాండ్రు బ. ౬౨. (౧) ౨౩౭ ఒడిసెల కాండ్రు బ. ౭౪.

(౧౨) ఎక్కళ్లు, డిగ్గళ్లు. (౨) ౩౩౯.

(౧౩) దండ్లు బ. ౨౧౪.

(౧౪) అవుళులు. బ. ౧౫౫.

(౧౫) వెడ్డుబుడ్లు. బ. ౭౧.

(౧౬) వాటుజాలు. బ. ౧౫౪

(౧౭) పాంతర్లు. బ. ౭౪- పితాళ్లు (౧) ౯౩

(౧౮) మోపరుల్. (౨) ౩౯౭

(౧౯) చూపలు. (౨) ౩౯౭- బ. ౨౨౧

(౨౦) ఊళ్లు, శేళ్లు. (౨) ౪౧౮- చివ్రళులు. బ. ౭౭

(౨౧) అడబాళ్లు (ఏక. అడబాల) బ. ౨౩౪

(౨౨) ఇటికేళ్లు (౧) ౧౩౦- ఎంగిళ్లు. బ. ౨౧౫- ఓకిళ్లు బ. ౧౪- తమ్మళ్లు. బ. ౭౯,౧౬౨- తొంగిళ్లు. బ. ౬౭- నక్కిళ్లు. బ. ౨౦౬- పక్కిళ్లు. బ. ౮౪- పిచ్చిళ్లు (౧) ౩౬౩- పుక్కిళ్లు. బ. ౮౧- పెండిండ్లు. బ. ౨౩- మెక్కిళ్లు బ. ౨౦౯- వడగళ్లు. బ. ౪౨

(౧౩) బహువచనార్థములో ఏకవచనము: పంద్రెండులక్షులు బలవత్పదాతి. బ. ౨౮.

## సంబోధన ప్రథమ.

(౧) బసవరో! బ. ౪౭. బసువరో! (౧) ౨౧౩- వీరభద్ర య్యారో (౧) ౪౨౭.

(౨) ఏలయా! బ. ౭౧- కరుణయా! (౨) ౩౪౮

(౩) ఏమేమిరోరి! బ. ౧౭౬- ఓరోరిబిష్ణు! బ. ౧౯౮.

(౪) చా! తక్కులార! బ. ౪౩- చా! దున్న! బ. ౧౦౭- చా! పంద! పంద! బ. ౪౫. (వీటిలో 'చా!' అనేది 'ఛీ'వంటిది. 'చావుము, చావుదు' అని అర్థముకాదు. దీనికి తాలవ్యోచ్చారణమని నా అభిప్రాయము. 'ఛీ!'వలె-

(౫) పాపికా! భ్రమసితే? బ. ౬౫. (ఇది 'కాన'వంటిది, లేదా, 'కాదు'కు సంబోధన రూపమేమో!)

## ఔపవిభక్తికములు

(౧) ఆమటణ్ (౨) ౪౮౦, బ. ౨౧౩, గూగెంటన్, చేతెంటన్, జుట్టెంటన్, జేనెంటన్, నల్లెంటన్, పాతెంటన్, మూరెంటన్, వ్రేలెంటణ్ (౨) ౪౮౦-౧.

(౨) నల్లెంటిమానంబు (౧) ౩౯౩. ఇటమీఁదటికిని. బ. ౧౭ నల్లేటిపాడవు. బ, ౨౨౨ -

(౩) ఎక్కడితల్లి మీరెక్కడితండ్రి,యెక్కడితోడు. బ.౨౨.

(౪) పెడతటికి (౧) ౪౩౩ - పిడికిటిలోననె. బ. ౧౧౦ - కరసంటి (౧) ౪౭౯ - తెఱసంటి క్రియ. బ. ౬౮ - తెఱసంటి యాఁకలి బ. ౧౧౯ - వలపటన్. బ. ౧౧౬ - దాపటను. బ. ౧౧౬

(౫) కోఱటన్. ౪౪ - వల్లకాటికిని. బ. ౬౭.

(౬) చాఁకింటన్ బ. ౯౭.

## తృతీయావిభక్తి

తన్నుఁగూడన్ = తనతోకూడా. బ. ౨౫, మాయసుమతిఁ జేసి. బ. ౯.

## పంచమీవిభక్తి

(౧) ఎన్నటిఁగోలెన్. బ.౮౧. ఎన్నటఁగోలెన్ ౧౬౩- ఎప్పటఁగోలెన్. బ. ౧౦౮ -

(౨) ఎప్పటికంటెన్. బ. ౧౪-ఎల్లవారలకంటెన్. బ. ౧౩-

(౩) ఏలినకంటెన్. బ. ౨౭.

(౪) పట్టి = కారణముచేత. (౧) ౫౪౦.

## షష్ఠీవిభక్తి

(౧) కరికాలచోడుకుఁ గనకవర్షంబు. బ. ౨౦౫-

(౨) నీయొక్క సంగతి (౧) ౮౯. (అర్థము చెప్పేటప్పుడు కావ్యములో 'యొక్క'ను సోమనాథుడుమాత్రమే వాడినాడు.)

## సప్తమీవిభక్తి

మంచుఁ గుంచానఁ గొలుచు (౧) ౩౮౯- పాషాణానఁ బసిఁడి (౧) ౨౦౯.

## కారకము

(౧) అమ్మనుల్ జన్మంబు వెడలఁగ (౧) ౫౯౧.

(౨) స్వస్తి! దీర్ఘాయువు! శంకర! బ. ౨౯ ('తే' అధ్యాహార్యము.)

(౩) నాబారిఁ బాటితి=నుండి బ. ౧౪౬- ఇంక నెవ్వరికి బ్రదుకంగవచ్చునే భక్తులచేత బ. ౧౦౧- అరుగుము భక్తజనాళిలోఁ బడలి=నుండి బ. ౨౩౫-

(౪) పసిఁడియారతులకు ఫల మెక్కుడు పిండియారతులు (౧) ౧౫౫- భక్తపాదోదకం బీసుపాదోదకములకు ఫల మెక్కుడు (=కంటె) (౧) ౨౬౬-

(౫) నీవు మెచ్చితిని (౧) ౧౦౪- బాణునకును మెచ్చి. బ. ౧౩౨- అతనికిఁ గూర్చువారలకు (౧) ౨౪౪- ప్రాణమునకు నలుగం గఁగ. బ. ౬౬- ఆపీనవరురాక కరికట్టె. బ. ౧౦౩- కాని, 'నీవు నెదురించు తప్పు సైరింపుము' (తప్పునకు) బ. ౧౦౬. అపరాధశత సహస్రావలి సైఁచి (సహస్రావలికి) బ. ౧౧౦- ఈ తప్పు సైరింపవలయు (తప్పునకు.) బ. ౧౦౭-భూమి సర్వాంగముల్ సోంకంగ మ్రొక్కి (భూమికి) (౧) ౧౩౪-

(౬) వ్యవహార మేఁగు (వ్యవహారమునకు) బ. ౪౨- ఇక్కడ రానోడి (ఇక్కడకు) బ. ౧౦౮- కడజాము వేచి (జామునకు) బ. ౧౦౮- మఠ మేఁగి (మఠమునకు) బ. ౧౧౧- శ్రీపర్వతం బేఁగి (శ్రీపర్వతమునకు) (౧) ౧౧౫-

(౯) భార్యను గనిసి (భార్యకు) (౧) ౨౧౬– మహాలింగదేవు సమ్ముఖుడై (దేవునకు) బ. ౭

(౭) కుష్ఠరోగంబునఁ బొందుము (౧) ౧౦౨

## సర్వనామములు

(౧) తానొక్క యిచ్చువాఁడయ్యె (తానుకూడా) బ. ౧౦౯. ఒకానొక్క జ్ఞానంబు (౧) ౫౯౬ – ఒక్కొక్క గిరులందు (౨) ౨౩౮– ఒక్కొక్క కోర్కుల (౨) ౨౭౭ –

(౨) ఏడి మీసుతుఁడు – బ. ౧౧౬.

(౩) కోలు చిన్ని లేక (ఇంత) బ. ౧౧౧.

(౪) నాదుచిక్కుటు. బ. ౯౪.

## తాను

'తాను' ప్రథమపురుష సర్వనామముగనే కాక ఉత్తమ మధ్యమ పురుషార్థములలోను వాడబడినది.

## ఉత్తమపురుషము

(౧) తల్లి వచ్చినఁగాదె తాను వస్తితిని. బ. ౬౬ – తా నెట్లు బోవుదు నానందమూర్తి – బ. ౯౬ – ప్రాని తాఁ బోనీదఁ బోయెద ననఁగ (౧) ౧౮౫.

(౨) ద్విజులము తారయంత్యజులము. (౧) ౧౫౯ –

(౩) తనుఁజేర్చికొనువాఁడ ననఁగి పెనంగి (నన్ను), బ. ౧౩ – పెనిమిటి తన్నుఁ జంపినఁ జంపనిమ్ము (నన్ను) బ. ౬౬ – తన్నుఁ బోలంగ విటులున్నవారె? (నన్ను) (౧) ౩౩౮– తన్నొల్లవేనియు (నన్ను) (౧) ౩౩౫– తనుఁగూడి చూడు (౧) ౩౩౫– తన్ను = నన్ను(౧ ౩౩౯ – తడయ కెక్కడనైనఁ దనుఁ గొనిపొమ్ము.

(౪) తమ్ముఁ జీరికిఁ గైకోరు సెంబలివారు బ. ౨౦౮ (మమ్ము)

(౫) ఆసాసలఁ దనయన్నలు నీకు దప్పిరి. (నాయన్నలు.)

(౬) తక్కినమాటలు దన కింపవు (నాకు) బ. ౬౫ – తల్లిచి గలుగంగఁ దనకు రోగంబుఁ బొందంగ నెట్లుండవచ్చు? బ. ౭౦ – తనకు నెప్పుడుఁ జావుదప్పదు (నాకు) బ. ౭౧ – తనకు = నాకు. (౧) ౩౩౯, ౪౮౨.

(౭) ధారుణి యేలంగఁ దను కింకఁ బాసె (మాకు) బ. ౧౪౫.

## మధ్యమపురుషార్థము

(౧) ప్రమథాధీశ! తనమనోగర్మంబుఁ దారి క్లైటెంగి (సీ) (౨) ౨౯౪.

(౨) తనుచింతలేల పొదం దనుకరణి (మి) (౨) ౨౯౪.

## క్రియలు

### ధాతువులు

(౧) ఉత్సాహించు (౧) ౫౧౭– అలంకారించు బ. ౨౮– (౨) ౧౭౯– ఉద్దేసించు బ. ౭౨– అహంకారించు బ. ౧౧౦, ౧౧౮– అసహించు (౧) ౩౨౪, ౩౨౮– శాపించు బ. ౨౩౨

(౨) చయ్యాన...అభి, ధియ్యాతే (౧) ౬౩– అలంకారించి (౨) ౭౯– అహంకారించి బ. ౧౧౮– ఆర్చి=ఆడించి బ. ౮౨

(౩) క్త్వార్థకములు: ఇటికి=ఇటికించి బ. ౯౭– ఉత్సాహించి (౧) ౫౧౭– ఉద్దేసించి బ. ౭౨– ఎగిది బ. ౧౯౦, ౨౦౦, ౨౧౯– తొడికిలి బ. ౧౧౯– తొడుకొనిపోయి (౧) ౧౧౯– సాతి=ధరించి బ. ౨౩– ఎత్తుక (౧) ౧౫౯

(౪) వ్యతిరేకక్త్వార్థకములు: చెప్ప లూడ్వక బ ౧౭౦. కొసనక (ధాతువు: కొసను) బ. ౧౧౨- కొలువక తక్కినక్ బ. ౨౧- తొడిఁబడక బ. ౨౩౭

(౫) తుమున్నర్థకములు: అలంకారింపక్ బ. ౨౮- అసహింపక్ (౧) ౩౨౪- తక్కినక్ బ. ౨౧- తొరలక్ బ. ౨౭

(౬) ధాతుజవిశేషణములు: అహంకారించు బ. ౧౧౦- ఆర్చు = ఆడించు (౧) ౪౯౭- దరిసించు=చూపించు బ. ౪౫.

## సంపూర్ణ క్రియలు

## ఉత్తమపురుషము

(౧) విన్నాఁడను, బ. ౧౧౬ -

(౨) పడతున్ = పడయుదున్ (౨) ౧౧౧ - శాపింతున్· బ. ౨౩౨.

(౩) తొడికింతము. బ. ౧౮౫.

(౪) చూతండు. బ. ౨౧౫, ౨౩౮, (౧) ౪౭౯, (౨) ౩౩- చెప్పదండు బ. ౧౫౦ - చొత్తండు (౧) ౪౩౯ - తీర్తండు (౧) ౪౫౬ - పడుదండు (౧) ౪౫౪ — పెట్టుదండు. బ. ౧౬౨ - పోదండు బ. ౭౧ - మ్రొక్కుదండు (౧) ౪౫౬ - వయితేఁడు (౧) ౪౩౯.

## మధ్యమ పురుషము

(౧) పుట్టినాఁడ ( - డవు) బ. ౨౦ - మినికితో (౧) ౪౫౪, మటాకుము. బ. ౭౦.

(౨) చా! కాఱు లేమని చదువుచున్నారు? బ. ౨౧౫.

(౩) నృత్యమాడుదుగాని (బ) ౬౨.

## ప్రథమ పురుషము

(౧) ఉన్నాఁడు, చదువుచున్నాఁడో - ఆడుచున్నాఁడో - బ. ౧౧౬.

(౨) ఏతెంచెన్ బ. ౧౬ - పరదేశి కింకరాఁబాసె మాపురికి. బ. ౧౦౧.

(౩) ఏతెంచెఁగానోపున్. బ. ౧౬ - వేవునో ప్రొద్దు! బ. ౧౦౫, చెల్లునో! బ. ౪౪ - వచ్చునె? (౧) ౧౦౨.

(౪) చావనద్దురు (అవకురు) బ. ౭౧ - ఇత్తురు. బ. ౧౬౨- అసహింతురు (౧) ౩౨౮-

(౫) ఆర్చెడిని = ఆడించెడిని. బ. ౧౦౧.
గాలివోసఁగుఁగాక! క్రుష్టులును (=గాలి లేదు, తప్పుకో!) బ. ౨౯.

(౬) ఒప్పురు. బ. ౧౩౯

(౭) అందురు. బ. ౧౪౫

(౮) భవిష్యదర్థమున భూతకాలక్రియ: కొలువక తక్కిన- బోలిసెబ్రాహ్మణ్యంబు, గోలిచెనేనియు భక్తివొలిసె (పొలియును) బ. ౨౧. బాధలపాలైతి పొమ్ము (అనుదువు)బ. ౧౭౦-కోటీశు లైరి(=అగుదురు) (౧) ౪౮౧

(౯) సందేహార్థకములు: వేవునో ప్రొద్దని. బ. ౧౦౫.

(౧౦) ప్రశ్నార్థకములు:

(౧) -అ : తెత్తునా? బ. ౭౧- చొచ్చితా? (౨) ౨౦౩- దాసి దేవయ్యగారా? బ. ౧౧౩.

—ఏ: కనుఁగొన, ముట్ట, నాకర్షింప, నెట్లు వచ్చునె? దివాకర ! నీకు? (౧) ౧౦౨- అంత భక్తుఁడనె? బ. ౩౯-

—ఏ: కడుపు నీకెయిపదే? బ. ౬౯

—ఒ: చదువుచున్నాఁడో?, ఆడుచున్నాఁడో? బ. ౧౧౬,
—ఓ: చెల్లునో? బ. ౪౪.. మినికితో? (౧) ౫౧౪-

(౨) ఏమి, 'ఎట్టు,'లతో:

ఈసెట్టులు? బ. ౧౫౪-కొలు లేమని చదువుచున్నారు? బ. ౨౧౫-చెప్పెడి దేమి? బ. ౮౮-కథ లేమి చెప్ప ('కలవు' అని అధ్యాహారము చేసుకోవలెను) బ. ౧౯- (౧) ౧౭౯- ఏమని చెప్ప ? బ. ౬౦, ౬౨-ఈఁడెట్టు. బ. ౫౭-భావించె దెట్లు? బ. ౧౯- కల రెట్లు? బ. ౧౪౫- నేర్చు నెట్లు? బ ౨౪౦.

(౧౧) శాపార్థకములు: భస్మమయ్యెదము! (౨) ౫౭, ౩౭౭.

(౧౨) ప్రార్థనార్థకములు:

(౧) అవధారు (=అవధరింపు తత్సమరూపము) (౧) ౩౭౬.

(౨) పాదపదము (౧) ౬౦౭ - పోనము. బ. ౧౦౭ - [౧) ౩౩౮.

(౩) అదిగోమ్మ (=అదిగో) బ. ౧౦౯ - ఊరకో. బ ౮౪.

(౪) చా! యనవయ్య. బ. ౧౦౯ - చా! యొట్టి మించేఁడు! బ. ౧౪౩ - చా! కొలు లేమని చదువుచున్నారు? బ. ౨౧౫.

(౫) రావయ్య! బ. ౧౧౭, రావన్న ! బ. ౧౧౭.

(౬) తల! తల! మని. బ. ౧౦౩. తొల! తొల! (౧) ౩౯౪-తొల! తొలఁడు! బ. ౨౧౫.

(౭) రండు! పొండు! కొండు! బ. ౨౩౦.

(౮) కొట్టుండా! బ. ౨౧౫.

(౯) స్త్రీలమీఁద కన్నార్పకుమీ! బ. ౨౫.

(౧౦) భక్తికాంతుండ! రావె!బ.౧౧౭-వనజాక్షి!వినవె!బ.౮.

(౧౧) ఈసంకటంబు నాదేవునకు మాన్పవే! బ. ౬౫.

(౧౨) లే! బ. ౧౦౭.

(౧౩) ఈఁజుమ్మర! బ. ౧౪౫.

(౧౪) పొడుతుఁజుండో! బ. ౧౦౦! వెలియుఁజుండో! బ. ౧౨౫! ఆజ్ఞఁదప్పినవారు సుండో! (౧) ౫౦౮! చూడుఁడో! (౧) ౧౨౫! మనుడుఁడో! బ. ౧౦౩! వినవో (స్త్రీ) (౧) ౪౫౯.

(౧౩) అవధారణార్థకము: పరమతత్త్వామృతంబయ చన్నుఁబాలు బ. ౯.

(౧౪) యద్యర్థకము: అటుగానినాఁడు బ. ౯; కలిగిరా= కలిగితే (౧) ౪౮౧

## పడుఁధాతువు

(౧) కర్మణ్యర్థము: ఎన్నఁబడు (౧) ౪౯౮, భక్తనిచయ పాదాంబు లెవ్వనిచే భజియింపంగఁబడును (౧) ౨౭౮. సర్వజ్ఞుఁడనబడి (౧) ౘ౯౨, (కీర్తి) అంకింపంగఁబడియె. బ. ౨౨౪.

(౨) వీరిదుర్జనత గనుఁగొనఁబడియె. బ. ౘ౧౪, భక్తి లోకంబునం దవలోకింపఁగఁబడియె బ.౧౨, గండరింపఁబడెనొ(౧) ౧౫౩, కనుఁగొనఁబడియె (౧) ౧౫౫, ౧౯౦, వినఁబడునె? బ. ౮౨, కానఁబడియెఁ (౧) ౧౫౪. పైవానిలో 'పడు' ధాతువు కర్మణ్యర్థములో రా లేదు.

(౩) నీదు ప్రాణాంగముల నొడఁబడియుండువాఁడ. బ. ౧౩ చాఁగిలఁబడి మ్రొక్కి. బ. ౩౩, చాఁగఁబడి మ్రొక్కి బ. ౧౧,

(౪) భక్తియు నీవును బడ్డట్లు వడుము బ. ౨౦-

(౫) పోవంగఁబడుడుఁ (=పోవడము సంభవింపగా) (౧) ౧౪౬

(౬) తొప్పఁబడు బ. ౮౧- ఒబ్బువడు బ. ౯౦- తూనిగి లింగఁబడుణ్ (౧) ౪౬౧

## అవ్యయములు

(౧) సంస్కృతావ్యయములు వ్యస్తముగా: నాకన్యథా శరణం బొందు లేదు (౧) ౧౦౨- ఉపనిషది (౧) ౮౦- రుద్రోపనిషది- మూర్ధ్ని ధరించు (౧) ౬౦

(౨) ఉగ్రమునన్=గా బ. ౧౩౩ - మహోగ్రమునన్ బ. ౧౫౫- తెల్లము (=తెల్లముగా) (౧) ౫౮౩- కల్యాణకటక మంత యును బ్రథితంబు మాలలపాలయ్యె బ. ౨౦౭ - శివునిమాటంకనై బ. ౧౮౨- వ్యక్తమి లేఁగెడువార్ బ. ౫౭-

(౩) నీవొండెఁబుట్టంగవలయు నట్టుగా కేనొండెఁ బుట్టంగ వలయు. బ. ౯౦- ప్రాద్దిక్కునో యొండెఁ బొగయు వల్చెడినో బ. ౮౦ - పడసినాఁడొండెఁబొడగంటి మిపుడు పొడగంటిమి బ. ౨౧౧-

(౪) అర్పింపఁదడవ. బ. ౭౫ - అడుగఁగఁదడవ బ. ౪౦, ౫౮-కదియింపఁదడవ. బ. ౧౦౩- చనుదేరఁదడవ. బ. ౧౩౮ - చూడఁగఁదడవ. బ. ౨౧౮ - జంకింపఁ దడవ. బ. ౧౦౮ - తలద్రోయఁ దడవ (౧) ౩౧౪ - తాఁకింపఁ దడవ. బ. ౧౪౯ - తూపొద్వఁదడవ బ. ౬౫ - సాఁడఁగఁ దడవ. బ. ౧౦౭. పుట్టఁగఁ దడవ. బ. ౧౬ - పుడుకంగఁ దడవ. బ. ౧౧౧ - ప్రవేశింపఁదడవ. బ. ౧౪- ప్రసాదింపఁదడవ - బ. ౧౪. చూపఁదడవ. బ. ౪౮ - ముట్టఁదడవ (౧) ౩౦౪ - వాయింపఁదడవ. బ. ౮౭ - వినిపింపఁదడవ. బ. ౧౪౨. వినుపింపఁదడవ. బ. ౧౪౬ - వేఁడంగఁ దడవ. (౧) ౨౧౨, సైవంగఁ దడవ. బ. ౧౩౬.

(౫) తోడ్తోన. బ. ౧౪ - పుట్టఁగఁ దోడనె. బ. ౯.

(౬) అచ్చన = నిశ్చయముగా. బ. ౭౧ - అప్పటిన్ = ఆ ప్రకారము (౧) ౩౦౯ - ఇరవిరిన్. బ. ౧౦౯ - ఒత్తువట్టఁగన్ = గట్టిగా. బ. ౬౨ - ఇంతటన్ బ. ౭౫- పింగల. బ. ౩౦- ముంగల. బ. ౩౦ -

(౭) కనుకనిఙ్ బ. (౧౫) తొడిఁ దొడిఙ్ బ. ౩౭, అఱి ముఱిఙ్ పోలెఙ్ (ఇది మఱి ఒక ఉపమానవాచకము మీదకూడా చేరఘుంది. వడువుఁబోలె బ. ౩౭, విధముఁబోలె బ. ౧౫, పగిది యుంబోలె (౧)౨౨౯) కరణినిబోలె బ. ౩౭ తెఱఁగునుబోలె బ. ౧౧౦.

(౮) ప్రతిఙ్ (౧) ౪౪౧, ౬౫౯, ౬౫౯, ౬౭౪- ప్రతిగట్టి (౨) ౧౯౪, ౩౯౭-ప్రతిసేయు బ. ౨౨౫- ప్రతిసూపు (౧) ౧౨౯. ప్రతిపక్కి (౧) ౪౪౦- ప్రతిదాల్పఁ గలఁడె. బ. ౨౭- ప్రతిపోల్చు (౨) ౧౯౨- ప్రతిమాటలు. బ. ౨౨౨- (౧) ౧౨౯- ప్రతిలేని (౧) ౪౭౯;— ప్రల్లఁబల్కుచుఙ్. (౧) ౨౯౭;— నీయంత నుండుము బ.౫౪- ఈఁడెట్లు? బ. ౫౭- భావించె డెట్లు? బ. ౧౯- కలరెట్లు? బ. ౧౪౫- నేర్చునెట్లు? బ. ౨౪౦-

(౯) ఆశ్చర్యార్థములు:

ఉఫే! (ఇది మహారాష్ట్రపు ఆశ్చర్యార్థ కావ్యయము. 'భళీ' అనిఅర్థము) బ ౧౮౬, ౨౧౪, ౨౪౫. ఉచ్చుచ్చిరే! బ. ౨౧౨- ఓ! బ. ౧౦౭- ఓచెల్ల. బ ౧౨౧- చాంగు! (౧) ౨౪౬- చాంగు! బళా! బ. ౨౨- నల్లవో (ఇదిఅరవముమాట) బ. ౧౩-(౧) ౨౦౭- మజబాపు (ఇది అంతా ఒక్కటే మహారాష్ట్రపుమాట. నాతండ్రీ! అని అర్థము) (౧) ౨౦౭, ౨౪౬- మజబాపురే! బ. ౧౦౯- హాహో! బ. ౧౦౭

## సామెతలు, ఉపమానములు

బసవపురాణ పండితారాధ్య చరిత్రములలో సోమనాథుడు వాడిన సామెతలీక్రింద అకారాదిగా వర్గీకరింపబడినవి.—

అంకురించు మ్రానికి నీరు మాని వట్టి కొఱటికి నీరెత్తునట్లు.
(౧) ౨౦౨

అక్కజం బగుచు వజ్రాయుధం బుండ, మొక్కల సురియకు మోహించినట్లు. బ. ౩౪౦

అంగిట నూరెడు నమృతంబు. బ. ౨౪౦

అగ్గిలోపల మూత్ర మఱియుటఁ బోసి, దగ్గటి వేల్పుఁ దొడంగిన యట్లు. బ. ౨౪౧.

అగ్నిసాన్నిధ్యతఁగాక యినుము ద్రావఁగ నేర్చునే యుదకముల?
(౧) ౨౦౧

అచ్చుఁగ్రచ్చులు (౧) ౩౪౧

అచ్చుగా నర్ఘ్యపణ్యంబులు దెచ్చి, యిచ్చఁ గుక్కల కాళులఁ బూన్చినట్టులు. బ. ౨౪౧

అద్దంబులోపలి నీడయట్లు. బ. ౧౭౩

అబ్జంబు పంకంబున (నున్నట్లు) (౧) ౨౦౯

అభిమానంబులేని మానిని. (౧) ౨౧౭

అమృతంబునందు దివ్యంబగు చేగపుట్టినట్లు బ. ౩౭.

అల్లి తన్నినఁ బఱపు పైఁ బడిన తెఱఁగు (౧) ౩౭౬.

అసత్యము చేత సత్యము మెఱయునట్లు (౨) ౧౭౭.

ఆకసమునఁ జిత్రరూపములు వ్రాయునట్లు (౧) ౩౫౯.

ఆడఁబోయినతీర్థ మెదురు వచ్చినట్లు (౧) ౩౭౮.

ఆవమునఁ గల్లునే రాగియుంతె? బ. ౧౫౪.

ఆవులు దలంచినచోటఁ బూరి మొలచినట్లు (౧) ౩౭౮.

ఇక్షుఫలములు (౨) ౩౯౯.

ఇంత లింగసవర్థుఁడయ్యు నీఁగకుచు దవు డింటిలోలేదు. బ. ౧౧౧.

ఇంతింతగాఁ జేయు నిక్షుఖండంబు, నంతకంతకుఁ దీపు లధికమౌఁ గాదె? బ. ౧౧౦.

ఇంద్రచాపముల్ (౨) ౪౧౯ (అనిత్యములు)

ఇనుముసుణ మరయునే పగుసంబు? బ. ౧౫౪.

ఇసుకఁ ద్రాడ్వేను (౧) ౩౫౯.

ఇసుమంతబూషిద నొసలఁ బూసినను, మసలక కొండంత మరులొందును. బ. ౧౦౬.

ఈసంగఁ గాచి నక్కలకు నిచ్చినయట్లు. బ. ౨౦౯.

ఉడువీధియందు విద్యుల్లతవుట్టి యుడువీథియందు దా నడఁగిన యట్లు. బ ౨౪౫.

ఉప్పుముడియ నీర నున్న నందణఁగు చొప్పున. (౧) ౧౭౨.

ఉప్పుముల్లెడు నీర ముంచినయట్లు. బ. ౪౨.

ఉప్పాలికి యిమ్మడియైనయట్టిచదువు. (౧) ౩౭౬.

ఊబరబుడిబుల్లు (౧) (౧) ౩౪౪.

ఊరు లేక పొలిమేర గల్గునే - (౧) ౬౩౬.

ఎడపకపాలు దానెన్ని వోసినను, విడుచునే సర్పంబు విసమొకింతైన? బ. ౨౪౦.

ఎండచే నీడ మెఱయును (౨) ౧౭౭

ఎండమావులు (౨) ౪౧౭ (అనిత్యములు.)

ఎండమావుల కడగాల్లుగట్టు (౧) ౩౫౯.

ఎద్దీనె ననిన గొందిఁ గట్టు మనినచందము (౨) ౧౪౫.

ఎద్దీనెననుటయు గొందిఁగట్టుమనువారుగల రెట్లు. బ. ౧౪౫.

కరితోడ గ్రామసూకరములు సరియో? బ. ౨౧౦.

కరినైరితోడఁ గుక్కలు పోల్ప సరియె బ. ౨౧౦.

(శ్రీశైలము) కరువుగట్టిన మహాకాళము (౧) ౭.

కర్కటిగర్భంబువోలె. బ. ౧౬.

కలఁగని మేల్కన్నయట్లు. (౧) ౨౪౯.

కలగన్న చోటికి గంపఁ గొంపోవ, ఫలసిద్ధి యగుటెల్ల భాగ్యంబు గాదె! బ. ౮౯.

కలి పెన్నుఁ బుచ్చు (ట) (౧) ౩౫౯.

కల్పవృక్షంబు ప్రాఁకి నల్లడలఁ జుట్టునట్లు (౧) ౧౮౬.

కల్లవెల్లిపాలు కథలేల? బ. ౧౦౧.

కసుఁగాయఁ ద్రెంచినఁ గాయగుఁ గాక, పసనిపండగునయ్య? బ. ౯౭.

కాకి పడగలు బ. ౨౩౦.

కాకిపాఁతల పగిది (౧) ౬౪౫.

కాకులు పెంచినకోకిలపిల్ల, గాకులఁ బోలునే కావుకావనుచు? బ. ౨౨.

కాంతిలేని మణి (౨) ౨౧౭.

కానవేర్చునె రవిఁ గౌశికవితతి? బ. ౨౪౦.

కాలియు రూపడంగని త్రాళ్లపగిది (౨) ౩౨౬.

కాలునినోరు డాకాలఁ దన్ను (౧) ౪౪౯.

కాష్ఠంబున నగ్ని (౧) ౨౦౯ – కాష్ఠంబు పావకునట్లు బ. ౧౭౩.

కుక్క ముట్టిన కడ్వాకును విధియేమి?, చక్కనఁ గాల్చిన సరియగుఁ గాదె? బ. ౧౯౮.

కుంపటిలోనఁ దామరదుంప మొలచునే? బ. ౧౫౪.

ఘటపటాదులలోని గగనంబునట్లు బ. ౧౮౪.

ఘనసారవృక్షముల్ ఖండించి నెల్లు, వేముఁ జెట్లకుఁ జుట్టుఁ బెట్టినయట్లు బ. ౨౪౧.

(శ్రీశైలము) ఘనీభవించిన పరంజ్యోతి (౧) ౮.

చప్పిపుట్టుట (౧) ౩౫౯.

చట్రాతిపైఁ గ్రుంకుట (౧) ౩౪౯.

చండిచే శూరుడు (మెఱయును) (౨) ౧౯౮.

చదువఁబెట్టినను, కలమతియును జెడ్డ కారణంబయ్యె బ. ౧౧౩

చంద్రుతో నుడుపంక్తి సరియే? బ. ౨౧౦.

చలనములేని వాయువు భాతి (౧) ౨౨౨.

చలమున నుక్కు వొలియించుకొన్నట్లు బ. ౧౦౮.

చిక్కంబుచేన్లు దీసినమాడ్కి (౧) ౨౨౧.

చిచ్చు ఉంకింగఁబోవుచుఁ జీరకొంగోసరించు పెన్వెంగలియట్లు.

చిత్తరువునకు జీవంబు పుట్టినట్లు. బ. ౩౮.

చీకటిచేత జ్యోతి (మెఱయును) (౨) ౧౮౮.

చూతఫలంబులఁ జుంబించుచిలుక బూరుగు ప్రాతిపండ్లఁ గన్గొనునె? బ. ౫౪.

చెఱకునఁ బంకు పుట్టినట్లు బ. ౩౮.

చెఱకుపండెనుం దొక్కయూనె నిక్కిన నోడు తేకాదె? బ. ౯౮.

చేఁతిచేఁదీపుఁ (మెఱయును) (౨) ౧౮౮.

జలధిలోఁ జాటిపడియలు సరియే? బ. ౨౧౦.

జలకుంభములలోని చాద్రునియట్లు బ. ౧౮౩.

జలతరంగములు (౨) ౪౧౮ (అనిత్యములు)

జలబుద్బుదంబులు (౨) ౪౧౮ (అనిత్యములు )

జలములయందు వర్షాఫలంబమరి, జలములలోనన సమసినయట్లు బ. ౨౪౫.

దొడ్డిలో సురధేను వొద్దుగాఁ దరియు, గొడ్డుఁ బిదుకఁ గుండఁ గొని పోఁగినట్లు. బ. ౨౪౦.

ననిచినవరునితో నాతి యనఁగి పెనఁగినట్లు (౧) ౧౬౬.

నలుపుచే గౌరవర్ణము (మెఱయును.) (౨) ౧౮౮.

నష్టకర్ణునకును నాద మేమిటికి? బ. ౨౪౦.

నాతికుచస్పర్శనము సేయు నంబిభాతి. (౧) ౧౮౦.

నిక్కము లేనిపలుకు. (౨) ౨౧౮.

నిట్టపాలులు (౨) ౪౧౮ (అనిత్యములు.)

నింపఁగ ముంచి యువియంగఁ ద్రోయు నవివేకి బ. ౨౨౦.

నిర్మేఘమైయున్న నభముకరణి (౧) ౨౨౨.

నివుఱు వెూఁదఁ గప్పియును మించునవలంబునట్లు (౧) ౩౯౧.

నీట వ్రాఁతలు (౨) ౪౧౮ (అనిత్యములు.)

నీపమాలినధరణీరుహంబునట్లు బ. ౨౪౧

నువ్వులఁ గల్గునే నూనియగుణము? నువ్వులలోపల నూనియ లేదె? బ. ౧౫౪.

నూతిలోఁ బడఁబోయి తాప వెదకుచు మెట్టెడి వీఁడియట్లు బ. ౯౬.

నూనియఁ గాఁజేసి నూల్కొనదీప, మానూవులందును నమరునే? బ. ౧౮౪.

నూలికి మొదలును గూలియు నిచ్చు, నోలికిఁ గోలు చిచ్చి చేలఁ గొన్నట్టి యీగి చెల్లింప (నట్లు) బ. ౧౧౫.

నూవులలోపలి నూనియయట్లు. బ. ౧౮౩.

నెత్తిగాలంబు (౧) ౭౧౨.

నేత్రములలోని రూపమట్లు బ. ౧౮౩.

నేలకు నింగికి నూత్రపట్టు (i) (౧) ౩౪౮.

నోరితాళము (౧) ౫౧౨.

పక్షికిఁ దోడ నేల పాశుపతంబు? బ. ౧౦౮.

పగవారిబిడ్డల నగవునఁ జంపుపగిది బ. ౨౩౦.

పటికంపుశిలలోని భావంబునట్లు బ. ౧౮౪.

పన్నగా నే లెంత స్వామి కడిగిన మన్న దాఁ బోవునే? బ. ౨౪౦.

పరగ లక్ష్యము ధనుర్ధరుఁ డేయఁబడిన, శరములట్లు (ఈశ్వరు నిరుమెయిగాఁడి) (౧) ౧౬౭.

పర్వతంబులలోని ప్రతిశబ్దమట్లు బ. ౧౮౪.

పలువురజా ప్రతినుగర్భంబులోపలను, వెలిగెడుదీపంబువిధమును బోలె బ. ౧౫.

పసనిపం డుండఁగఁ గసుఁగాయఁ ద్రెంచుట (౧) ౪౭౦.

పసిఁడిఁ గమ్మఁదనంబు పుట్టినట్లు. (౨) ౩౮.

పసిఁడినాఁగటఁ బెక్కుభంగుల దున్ని, వెస ముల్లువిత్తులు వెదవెట్టినట్లు. బ. ౨౪౦.

పసిఁడిపుత్తళికిని బ్రాణంబు పుట్టినట్లు. బ ౩౮.

పసులకాఁపరిలేని పశునివహంబు. (౨) ౨౧౮.

పాటితూముసకును బాటియా నేనిఁ, బాటింపసోలయుఁ బాటియ కాదే? బ. ౫.

పాపంబుచేఁ బుణ్యసంప్రాప్తి (మొఱయును) (౨) ౧౮౮.

పాయసముపై నెయ్యొల్కినట్టి యురవు (౧) ౩౮౭.

పారిజాతంబుతోఁ బ్రబ్బిల్లు సరియో? బ. ౨౧౦.

పాలలోపల నుదకములు గలిసినపద్ధతి. (౧)

పాలలోపల నేయియట్లు. బ. ౧౮౩.

పాషాణంబులో నినుమట్లు. బ. ౧౮౩.

పాషాణానఁ బసిఁడి. (౧) ౨౦౯.

పిపీలికామార్గంబులు (౨) ౪౧౭ (అనిత్యములు).

పులిజున్నుఁ గోయని యట్లు (౨) (౧) ౩౫౯.

పువ్వుఁగంపునై. బ. ౬, పువ్వునుగంపునుబోలె. బ. ౨౪౫.

పూసలలోనిదారంబుక్రియ. బ. ౫, పూసలలోని దారంబు నట్లు. బ. ౧౭౩.

పెన్నుదు లురువడిఁ బాటి శరధిఁ గూడినయట్లు. (౧) ౧౬౬.

పెన్నిధి యుండఁగ మన్నుడుగుదురె? బ. ౧౧.

పేద దాఁ బెన్నిధి యింటఁ గన్నట్లు (౧) ౧౭౦.

పైఁగొసరఁ గుచంబు గూలఁబడ్డట్లుగఁగూడ నిమ్మనిన బ. ౨౩౦.

పొట్టపొరుగ్గునఁ గల్పభూరుహం బుండ, వట్టి వృక్షమునకు వడిసేఁగినట్లు. బ. ౨౪౦.

పొట్టలోపలియట్లు. (౧) ౫౧౧.

పాలమున నాఁబోఁతుఁ బలిగొన్నయట్టిపాలుపు. బ. ౭౫.

పొలుపుగాఁ దేనియ వోసి నూటినను, నిలఁ దీయనై యుండునే వేఁపనారః బ. ౨౪౦.

పోల దుర్జను గూడిపొందునకంటెఁ జాల మేలండ్రు సజ్జనవిరోధంబు. (౧) ౩౧౩.

ప్రపంచంబుచేఁ బరమాత్మైకసిద్ధి. (మోక్షయును) (౨) ౧౭౭.

ప్రాణంబుగల్గినను, బలుసాకుఁదినియైన బ్రతుకంగవచ్చు. బ. ౨౩౦.

ప్రాణంబులేని దేహంబు (౨) ౨౧౭.

బండు లాంగొంచె తాఁ బాయఁబెట్టుదును, బండి లేకుండు పగిది. (౧) ౨౯౯.

బయలిదీపములు (౨) ౪౧౭ (అనిత్యములు).

బారిసమరెకుమిత్తి. (౧) ౫౧౧.



మల్లిమొగ్గలునైన మదనుని వేఁడివెల్లగాఁ జేసితి (వి) బ. ౧౮౦

మసికప్పడమునఁ గప్పఁబడియు వెలుఁగు మాణిక్యంబునట్లు.
(౧) ౩౯౧.

మహాబ్ధిలో వర్షోపలములు విరిసినట్లు (౧) ౧౮౨.

మాణిక్య మొకమసిబోకఁబొదివినఁ గాంతిచెడునె? బ. ౨౨౪.
చూ. ౨౨౧.

మానకజలములలోన నేప్రొద్దు, నానిన శిల మెత్తగ నేర్చునెట్లు?
బ. ౨౪౨.

మామిడివిత్తు: దా మహిమీఁద విత్తవే మనునే? బ. ౨౧

నాలకుమాంసము మఱిగొ నారికిని, నోలునుగాచుంద. బ. ౧౦౪.

మీఁదఁటఁబ్రాఁచి గప్పియును నమలినంబైన గంగాంబువులట్లు
(౧) ౩౯౨.

ముక్కుపైఁ గత్తి (౧) ౫౧౧.

ముంగిటిపెన్నిధి బ. ౨౪౦.

ముంజేతికంకణంబున కద్దమేల? (౧) ౬౨౦.

ముంపమోపులపగిదిన్. (౧) ౨౪౪.

ముంచటిశిరం బుండ, మోకాలికిని సేసవెట్టినట్లు. (౧) ౨౦౨.

ముల్లుచ్చి పెద్దపద రడ్చినట్లు. బ. ౨౧౨.

మృగపతి యొద్దన మేయునే ఫుల్లు? బ. ౫౪.

మృగవ్యాఘ్రుఁ డొడ్డినయురుఁ వలలభావమున. (౧) ౧౭౭.

మెఱఁ బొట్టైపివాము. (౧) ౫౧౧.

మెఱుఁగుఁదీవెల్ (౨) ౪౧౫ (అనిత్యములు.)

మేరువుతోఁ జెఱమెట్టులు సరియె? బ. ౨౧౦.

మేరువుసోఁకి కాకి తచ్ఛాయఁగాకి వర్ణిల్లు? - బ. ౨౨౪.

మొయిలులమహిమ. (౨) ౪౧౫ (అనిత్యము.)

మోకాళ్లను బట్టతలలను ముడిపెట్టు (౧) ౩౫౯.

రత్నపరీక్ష యెఱిఁగి చేపట్టుబచ్చునుబోలె. (౧) ౨౬౭

రవితోడఁ గిరణము లస్తమించుపగిది. (౧) ౨౨౧.

రసహీనమైన నిస్సారంపుఁగవిత (౨) ౨౧౮.

రాకామలజ్యోత్స్నఁ ద్రావుచకోర, మాకాంక్ష సేయునే
చీకటిఁ ద్రావ? బ. ౫౭.

రాజితాంచిత రత్నరాజ ముండంగ గాజుపెంచిక లేఁబ గమి
యించినట్లు. బ. ౨౮౦.

రా నేర్చునే పుష్పరసమున కీఁగ? ప ౨౮౦.

రెండుగాఁ బాఱెడునీరు వ్రేయు (ట) (౧) ౩౫౯.

రెండునోళ్లను గుడ్వకుండినఁగుక్షి, నిండునే గండభేరుండంబున
కును ? (౧) ౨౦౨.

రే పగలు సేయు (ట) ౩౫౯.

రోఁకటఁ జిగురులు గోయు (ట) (౧) ౩౫౯.

రోఁకటిపాటలట్లు. బ. ౨౧౨.

లంపానఁ గోసిన లాచిన నెఱయఁ, గంపెకుఁ గాక శ్రీ
గంధంబునకును ? బ. ౧౧౦

లా నార యొలుచు (ట) (౧) ౩౫౯

లోష్టుఁగూటము (౧) ౫౧౧

లోళ్ల రోఁకళ్లఁ బాడు (ట) బ. ౧౨౮.

లక్ష్యము ధనుర్ధరుఁ డేయఁ బడిన శరములట్లు. (౧) ౧౭౭

(శ్రీశైలము) లతగరిగొన్న మూలస్తంభము (౧) ౮.

వట్టియాకులు గాలివడిఁ దూలుఁగాక, మెట్టలు దూలునే యెట్టి
గాడ్పునను? బ. ౨౨౯.

వడగండ్ల గుండ్లు గట్టు (ట) (౧) ౩౫౯.

వడగళ్లవర్షంబు వారాశిఁ గురియువడువున బ. ౪౨.
వ్రాఁతకోట నోడయుండంగ వదరూఁదినట్లు బ. ౨౪౦,
వాడపొత్తు (౧) ౩౪౧.
వానరం బెఱుఁగునే వరరత్నమహిమ? బ. ౨౪౦.
వానవజ్రములు (౨) ౮౧౯. (అనిత్యములు.)
వాయసఫలన్యాయము. బ ౩౫.
వాయువుఁ బట్టు (౬) (౧) ౩౫౬
వారిధిఁ దటినీప్రవాహముల్ గలియఁ, బేరున్నదే వేఱ? బ. ౨౨౪
విద్యాప్రభవములేనట్టి సభాసమూహంబు (౨) ౨౧౯.
విమలమాణిక్యగర్భమున దీపంబు పుట్టినట్లు. బ. ౩౯.
విరిదమ్మివాసన విహరించు తేఁటి, పరిగొని సుడియునే ప్రబ్బలి
    విరుల? బ. ౫౪.
వీచి ప్రవర్తితంబగుచు వచ్చు వహిత్రంబు వడువునబోలె.
    బ. ౩౭
వీపుఁగోల. (౧) ౫౧౧.
వెన్నెలఁ బ్రోవుగాఁ జేయుట (౧) ౩౫౬.
వెలివాడఁ గలుగునే వేదఘోషంబు? బ. ౧౫౪.
వెల్లవేగియుఁ దినికి చాబిడ్డఁ గనినచందము. బ. ౨౨౦.
వేమాఱు నెంతగాచినను వన్నెకెక్కఁగాదె సువర్ణంబు? బ. ౧౧౦
వేయువిధంబుల వెలిగడ్డ వదరుఁ, గాయలోపలిచేఁదు వాయని
    యట్లు. (౧) ౧౬౫.
శబ్దంబులోపలి యర్థమట్లు. బ. ౧౭౪.
శరనిధిఁ గపులు జనియించి వెండి శరనిధిలోనన సమసినయట్లు.
    బ. ౨౪౦.
శర్వాణి నీలాంబుజముఁ దాల్చునట్లు (౧) ౧౭౦.
శశిలేని నిశి (౨) ౨౧౯.

## జాతీయములు

అక్కు_నూలినభంగిన్ (బ. ౨౧౪), అంగిటియుల్లొత్తు (బ. ౬౮) భవబాధలకు నగపడి (బ. ౧౭౧); ఉదయింపకటమున్న యుదయించె మహిమ, ఇంపారి సొనుపారి కంపుసొంపారి చాలనొప్పెడు బిల్వపత్త్రి (బ. ౭౦), ఉన్నయున్కిన (౧) ౪౫౧, ఎక్కుఁగొల్లు (౧) ౫౧౧, కనుమూయనెడయు లేదనఁగ ముప్పెట్టిగొనియె (బ. ౮౩), ఇట్లింతకెత్తి కొన్నాఁడింక నిఁకమీఁద నెంత కెత్తికొనున్నాఁడో? (బ. ౧౫౫), ఒండొరుఁ జేవ్రేసి నవ్వన్ (బ. ౬౩), వడిఁబాఱు జలముల కొడలెల్లఁ గాళ్లు, వడిఁ గాలుచిచ్చున కొడ లెల్ల నోళ్లు, వడి వీచుగాడ్పున కొడలెల్లఁ దలలు, వడిఁ జేయుబసవన కొడలెల్ల భక్తి (బ. ౩౭), పుడమి ఒడ్డగెడవయ్యె (బ. ౩౩), ఒత్తుపట్టఁగన్ (బ. ౬౨), ఓరంతప్రొద్దు (౧) ౪౫౦; ప్రోలు సూడఁగఁగంటిన్ (౧) ౧౪౬; కనుఁగవ ధూళిఁ జల్లు (౧) ౪౪౯, కన్గంట వీక్షించి (బ. ౧౧౬), ముకురంబు గన్గొల్పి (౧) ౨౧౩, కుండగూల్చినభంగి వారక వర్షంబు వఱుగొని కురియ (౧) ౧౪౬, కెలస మానతియిండు (బ. ౨౪౧), కోయనిపొగడు (బ. ౩౮), గామడ్చినట్టులు (బ. ౨౦౬), గుండెబెదరు (౧) ౫౧౧; కుడుపున కియ్యెడ నుడనుడ లేల? (బ. ౮౧), గొడ్డువీఁగి కనినకొడుకు గారాముబిడ్డని (౨) ౧౬౮, గోరంతప్రొద్దు (బ. ౮౪), నీవుఁజాలుదే రక్షు, చాలవేఁ జిక్కుము (౨) ౫౧౩, చిత్తంబుచిగురు (బ. ౧౫౬) చీరికిఁ గైకొన్న (బ. ౧౦), చెమటయే నెత్తురన్ తల్లి (౨) ౧౫౬, ముక్తిచేగయై గరిగొన్న శివప్రసాదంబు (౧) ౧౦౦, చొల్లువాఱుడు మాటలు (బ. ౧౯౬), చొళవాళికకాక వేళవాళికిని వత్తురే? (బ. ౧౯౫), కొలువక తక్కినఁ బొలిసె బ్రాహ్మ్యంబు, కొలిచెనేనియు భక్తి వొలిసె (బ. ౨౧), నీయొగి వేయును మాకు వచ్చెఁ దక్కుము (౧) ౩౬౨, బసవనిఁ దలఁచుతలఁపు బలుపుగాఁ జేసి భావష్టుమెఱ

సిన (బ. ౫), తేటతెల్ల (బ. ౧, ౧౧, ౨౫, ౩౬) భక్తి దుద్రేకిం తన లోనఁ దొట్రుకొనఁగ (బ. ౨౫), (ఒకబూతె) నమలెనో నమలఁడో (బ. ౧౧౯), నవకమెసఁగ (బ. ౧౧), నాము మేయుంబ (బ. ౨౦౨) నిన్నగా దటుమొన్న (౧) ౬౩౭, నిలుకాల నిలువంగ నేరక తిరుసు నలమట (బ. ౬౨, ౨౦౦) నిజవుఱువడి శివునేత్రత్రయంబు (బ. ౭౬), నోములుగీములు వేములఁ గలిపి (బ. ౧౬), పచ్చిబొంకులు (౧) ౩౮౧; అతఁడు పట్టెడుకూటికర్థాంశు (బ. ౨౮), భక్తియు నీవును బడ్డట్లు పడుము (బ. ౨౦) - పాషాణానఁ బసిఁడి (౧) ౨౦౯ - విధి గట్టి పిఱ్ఱతాఁకు (౧) ౮౮౯ - పున్నెంబు మాలినపాడ (డు) వలము (బ. ౧౫౦) - పుట్టినాఁడ కులము పురులు వోనాడెన్ (బ. ౨౦) - పుట్టువుమాలుపోఁతు (౧) ౧౨౪ - పురులువోనాడి (బ. ౧౦౮) - వార్తయుఁ బూసగ్రుచ్చినయట్లుగాఁ జెప్పి (బ ౧౫౦) పొట్టపొర్వ్వన (బ. ౨౪౦) - సర్వాంగములఁ భువిఁ బొంద మ్రొక్కి (బ. ౭) (౧) ౧౩౮ - శరణుల నలుకడ లరసిపట్టి చూడంగ నీప్రాప్తియే? (బ. ౨౧౨) - ప్రాలుగల్లు సుపుత్త్రుఁబడసితిమి (బ ౨౦) - ప్రేవులుమాడు (బ. ౮౦) - అద్రిజాత వలపలిబరి (౧) ౮ - బుడిపుల్లువోవు (బ. ౨౧౪) - బొంతకు గంతకుఁ బ్రోవిడి (బ. ౧౧౧) - మంచుఁ గుంచానఁగొలుచు (౧) ౩౪౯ - మడికూటివృత్తి (బ. ౨౨౯) వెదకిననైననొకఁడు మందునకైన నూరిలో లేఁడు (బ. ౨౪) - మనసు తల్లడము (౧) ౫౧౨; నేనన్నఁ బోవునే పేదలమునుక? (బ. ౧౧౪); అచ్చెరువుఁ బ్రహర్షంబు భక్తి ముప్పిరిగొని (బ. ౧౭) - ముదము గోపము దెంపు ముప్పిరిగొనఁగ (౧) ౨౮౪ - రీతులు నేతు లుట్టంగ (౧) ౧౮౦; లోకుల కొకటిపులు (బ. ౧౦౨) - విక్కన విరియు (బ. ౨౨౧, ౨౨౪) - వ్రచ్చివందటిలాను (బ. ౧౦౪) - 'హా' యని సత్త్రె పాయుక్తి (బ. ౩౭) - మొదలయినవి.

## ఊఁతపదములు

భాషలోని అందమును చాలామట్టుకు ఊతపదముల ప్రయోగము వల్ల సోమనాథుడు వెలయించినాడు. ఇవి అనేకవిధములుగా ఉన్నవి. కొన్నిటిని క్రింద చూపుచున్నాను.

(౧) కట్టెగిట్టె (బ. ౭౫) – కట్నంబు గిట్నంబు (౧) ౩౪౦ – జక్కులు గిక్కులు (బ. ౧౧౩) – నోములు గీములు (బ. ౧౬) – బాసలు గీసలు బ. ౧౦౯ (౧) ౨౪౩.

(౨) కస్వగట్ర (బ. ౭౫) – కొలుచుగాట్ర (బ. ౭౫) – పలిగట్ర (బ. ౭౫) – బడియబట్ర (బ. ౭౫) – మానుమట్ర (బ. ౭౫.)

(౩) అంజలి గుంజలి (బ. ౧౦౪) – ఆకులునలము (బ. ౭౭) కోరికకడమ (బ. ౯౯) – చుట్టాలఁ బక్కాల (బ. ౨౩౪) – దిక్కు నాఁ దెసయును (బ. ౧౪౦) – దెసయు దిక్కు (బ. ౧౩౬ (౧) ౨౦౨) పండుగులు ప్రబ్బములు (౧) ౩౪౦ – పూరియుఁబుడుక. బ. ౭౫ – పేదలసాదుల. బ. ౧౧౪ – పాలుపోసు. బ. ౧౦౩ – మందుమ్రాఁకు. బ. ౬౯, ౭౫, ౯౫ – మాడమడక (౧) ౩౪౦ – వీసము నాసము. బ. ౧౧౪ – వేరు వెల్లంకి. బ. ౭౭ – వేసరవాసరన్. బ. ౬౯ –

ఇట్టి జంటపదములను వాడి సోమనాథుడు కవితకు తెచ్చిన అందమున కీ క్రింది ఉదాహరణ మొక్కటి చాలును.

"ఆలింగమూర్తి నెయ్యంబు దియ్యంబు,
మూలంబు దాలంబు, ముద్దునుందుద్దు,
భ్రాంతియుఁగాంతియు, రంగుబెడంగు,
శ్రాంతివిశ్రాంతి లక్షణము సద్గుణము,

భాతియు రీతియుఁ, బదమును ముదముఁ,
బ్రీతియు నీతియుఁ, బెంపును సొంపు,
నేపును నోపును, నెలమియుఁగలిమి,
వ్రాపును దీపును, రూపు రేఖయును,
మురువును వెరవును, మొగియును బిగియుఁ,
బురులును నెరులుఁ, బ్రస్ఫూర్తి దస్ఫూర్తి,
సెన్నును నన్నును, జెలువును నలువు,
నున్నతి సన్నుతి, యొప్పును మెప్పు,
లలియును లులియును, లాగును బాగుఁ,
బోలుపును బలుపుఁ, బ్రస్ఫూర్తివిస్ఫూర్తి,
భరితమై పండిత ప్రభుదృష్టి యందు,
కరువునఁ బోసినగతిఁ బిక్కటిల్లి"

(౧) ౧౩౫.

(౫) వ్యతిరేకములు: ఏఁటువల్లము, కొట్టుగట్టు, తెరువవెవి. బ. ౩౭.

(౬) పిట్టపిడ్గరన్. బ. ౧౭౯; బట్టకబయలు. బ. ౭౬;

(౭) అవసరవేళ (౧) ౧౬౮; కూలకట్టు. బ. ౧౭౨.

## ఆమ్రేడితము

తెనుగు అందమునకు పదముల నామ్రేడితము చేసి పలుకట మొకలక్షణము. దీనిని సోమనాథుడు సంపూర్ణముగా వినియోగించు కొన్నాడు. కొన్ని ఉదాహరణములు:

(౧) బసవస్వామిగాఁగవచ్చునే పెఱపెఱవారలకెల్ల. బ. ౬ అలుగర్గరాచి (మిక్కిలి అరుసనట్లుగా) (౧) ౭౨౭; కథకథకు వచ్చుచును, గడియగడియ చెప్పక. బ. ౮౯; సోమవారము సోమవారము (=ప్రతిసోమవారమున్ను) (౨) ౧౧౭; వారవారము.

(౨) ౧౧౪; ముదలింపముదలింప బ. ౨౧౨; ఆడియాడి, ఉప్పొంగియుప్పొంగి, క్రాలిక్రాలి, చేసిచేసి, చొక్కిచొక్కి, తేలితేలి, తొప్పఁదోఁగితోఁగి, పొర్లి పొర్లి, మ్రొక్కిమ్రొక్కి, వ్రాలివ్రాలి, సోలిసోలి, (బ. ౩౩.)

(౨) కదలక మెదలక, ప్రక్క త్రిక్కనక, చెప్పక చేయక, మొదవైసవి.

## పదజాలము

(౧) అచ్చతెనుగు మాటలలో సోమనాథు డుపయోగించి నన్నిటిని మరియే తెనుగుకవిన్ని ఉపయోగించలేదు. ఇతడు వాడిన పంపలకొద్దిపదములు నిఘంటువులలోని కెక్కలేదు. అట్టివాటిలో కొన్నిటినిమాత్ర మిాక్రింద చూపుచున్నాను.

అంకన, అంకనము, అంకుసాంకులు, అకో!, అఖండ బిల్వ పత్రిరి, అక్షిరోగము, అసుద్య, అటవిలు, అడపతిత్తి, అడిస్రొంత కచ్చడము, అతకులు. అతము, అందుల, అద్దరి, అనసులకోల, అనసుల మొగడె, అనసులు, అనుగులవు, అనువు గద్దెంగరులు, అన్నెకక్క అమరారు, అరజలు, అరమని, అరసుట్టు, అరిగిపండ్లు, అర్ఘ్యపణ్యములు, ఇజ్జలజ్జలవాగు, అలికటము, అలిముటితనము, అలువ, అలసుల కలశము, అసిగోంత, ఆంక = ప్రక్క, ఆటకూటము, ఆండెలి, ఆదరికము, ఆనందవతి, ఆనందవర్తి, ఆనుపశి, ఆరతిజోళ్లు, ఆరతిపలుకలు, ఆరోగ్యసంపద, ఆశతి, ఇక్కంటి, ఇలువుట్టు, ఇలువుట్టుదాసి,

ఇల్లిదే! ఉక్కళిల్లు, ఉఘే!, ఉత్తెర, ఉనుపరి, ఉప్పరము, ఉప్పరగిల్లు, ఉటిముడి, ఉజ్జుటు, ఉలిపిజంగెత, ఉల్లిగడ్డము, ఉవిదము, ఉసుగు, ఉసులు(క్రియ), మొదలయినవి.

(౨) సోమనాథుడు తన కాలములో వ్యవహారములో ఉండిన అన్యదేశ్యశబ్దములను ప్రయోగించడానికి వెనుదీయలేదు:

కఠారము. బ. ౨౩; కడానినక్కలు. బ. ౧౧౪; కోర=కొన్న. బ. ౬౯, (౧) ౪౮౩; జోహారు (౧) ౪౩౧, మొద.

## (౩) కొన్ని శబ్దముల అర్థవిచారము :

(౧) మంగళారతి. (౧) ౩౮౨. ఇది మిశ్రసమాసము; 'ఆరతి' తెనుగుమాట. ఇది 'ఆళతి'కి రూపాంతరము. కన్నడములో 'ఆళతి' అంటే పాట. దీనికి 'ఆణతి' రూపాంతరము. 'ఆళతి' బ. ౬౨. మంగళపుపాట పాడుతూ కర్పూరము మొదలయినవాటిని వెలిగించి చుట్టూ త్రిప్పుతారు గనుక అట్టి ధూపదీపమునకున్నూ, వాటిని త్రిప్పుటకున్నూ కూడా ఈమాట కుదురుకొన్నది. శ. ర. లో 'ఆళతి' అనేపదము లేదు. 'ఆరతి'కి 'హారతి' మొదటిరూప మని ఉన్నది. ఇది తప్పు. 'ఆరతి' మొదటిరూపము. 'ఆరతి'కిగాని 'హారతి'కిగాని శ. ర. లో అర్థము లేదు. అది వైకృతము అని మాత్రమున్నది. దేనికి వైకృతమో చెప్ప లేదు. 'ఆళతి' 'ఆలప్తి'కి తద్భవరూప మని నాతలంపు.

(౨) అనుమానము. బ. ౬౪. సందేహము; ఈ అర్థము సంస్కృతములో లేదు.

(౩) అర్ఘ్యపణ్యములు. బ. ౬౧. శ. ర. లో లేదు. దానిని మించసంకల్పించిన సూర్యరాయాంధ్రబృహన్నిఘంటువులో కూడా లేదు. ఈ మాటను సోమనాథుడు చాలా తరచుగా ఉపయోగిస్తాడు. చూ. బ. ౬౧, ౨౧౦; (౧) ౧౩౫, ౨౮౩, ౪౫౩; మొద. శ. ర.

